# ఆడబ్రతుకు

## (నారీర్ మూల్య)



శరత్ బాబు



అనువాదం :-

దిగవల్లి శేషగిరిరావు



దేశికవితా మండలి
ఘంటశాల & బెజవాడ

ప్రతులు 300
ప్రథమ ముద్రణ, 1945

వెల రూపా॥

సంపాదకులు :

బొందలపాటి శకుంతలా దేవి

శివరామకృష్ణ

సరస్వతీ ముద్రాక్షరశాల
బెజవాడ

# ఆడ బ్రతుకు
## (నారీర్ మూల్యా)

లోకంలో ఏదన్నా వస్తువు, ఎక్కువ విలువగలదిగా వున్నదీ అంటే, అది సులభసాధ్యం కానిదని తాత్పర్యము. ఇందువలననే మణి-మాణిక్యములత్యధిక విలువ గలవగుట. ఈ లెక్కను స్త్రీకి విలువకట్టినచో, ఆమెకగాను మూల్యము చెల్లింపనక్కరయే లేదు. ఇదేరీతిని జలముకూడ !

ఈవస్తువులింత సులభసాధ్యములగుట వలననే మనము వీటిని గౌరవదృష్టితో చూచుట లేదు. కాని, లెక్కను వీటి మూల్యమును నిర్ణయించుట సరికాదు. రాజాధిరాజుకూడ, దప్పికతో నుండి, నీరులభ్యపడని సమయమందు, తనకిరీటమందలి రత్నముననైన నిచ్చి, తన దాహశాంతికై నీటిని గొనుటకు వెనుకాడడు. అదేరీతిని, - పాపము శమించుగాక, - స్త్రీలే లోకమున కొరవడినచో, ఆనాడు స్త్రీయొక్క విలువ, - ఆమె ఎంత విలువగలదియోలోకమునకే తెలియగలదు.

పైరీతిని స్త్రీయొక్క మూల్యమును నిర్ణయించుటకు ప్రస్తుతము వలను పడదు. కాని, పురుషునకు స్త్రీ ఎప్పుడు, ఏరూపమున ఏస్థితియందెంత ఆవశ్యకమో లెక్కగట్టి వెలనిర్ణయించి, ఆమె అంత ఖరీదుచేయునో, చేయదో తెలిసి కొనవచ్చును.

మచ్చునకు చూడుడు: ఇంటిలో విధవసోదరి కంటె భార్య ఎక్కువ ఆవశ్యకమైనది. కావున భార్య విలువఎక్కువ కాని, భార్య గర్భవతియైయుండి ప్రసవించు రోజులు సమీ

పించుమనప్పుడు వితంతు సోదరి విలువ కొంచెము పెరుగును;
అప్పుడు వంటచేయుట, చిన్నపిల్లలకు అన్నము తినిపించుట
మొదలగు ఎన్నో పనుల నామెయే చేయవలసివచ్చునుగదా!

ఈరీతిని చూచినచో సోదరి - అందును విధవాసోదరి
రూపమున కంటె భార్యారూపమున స్త్రీ అధికమూల్యము
గలదని తెలియుచున్నది. కావున, ఈరీతిని స్త్రీ ఏఏరూపమున
ఎంత విలువగలదై యుండునో తేల్చవచ్చును. దీనిని కాదను
టకు వీలు లేదు.

కాని, యింకొక సంశయముగలదు. స్త్రీకొరకు లంకా
రాజ్యము నాశనమైనది. ట్రాయ్ రాజ్యము విధ్వంసమైనది.
ఈరీతిని ఇంకెన్ని చిన్నా - పెద్దా రాజ్యములు నష్టమైనవో;
ఎవరు చెప్పగలరు? తన సామ్రాజ్యమునేగాక, ప్రాణమును
కూడ కోల్పోవుటకు స్త్రీవలన ఏ గొప్పలాభమును పొంద
గోరి వారు వెనుకాడలేదు? వారు స్త్రీ కొరకై సామ్రా
జ్యము, ప్రాణములనుకూడ పణముగ నొడ్డిరిగదా? దీనివలన
స్త్రీ వీటన్నిటికంటె విలువయైనదని తేల్చవచ్చుననుట కెవ
రును సందేహించనక్కరలేదు. దీనినిబట్టి స్త్రీయొక్క విలువ
కట్టుటకు వుసులుబాటే వుండదు. ఇంతేగాన తన సర్వస్వ
మును కోల్పోవుటలో స్త్రీకొరకెంతవరకు కోల్పోయెను?
తన కట్టుబాటులేని ఉచ్ఛృంఖల ప్రవృత్తిచే ఎంతవరకు
కోల్పోయెను? అను ప్రశ్నలకు జవాబెవరు చెప్పగలరు?

కావున, స్త్రీయొక్క విలువను ఆమె, సేవాపరాయణ
త్వము స్నేహశీలత, పాతివ్రత్యము, దుఃఖము - కష్టముల
నెంతవరకు సహించగలదు. ఆమెవలన పురుషునకే యే సుఖ
లాభములుగలవు, ఆమె ఎంత అందగత్తె పురుషుని వాంఛల
నామె ఎంతవరకు తీర్చగలదు? అనెడి విషయములను విచా

రించి నిర్ణయించుటకు మనకు వేరుమార్గము లేదని, భూభాగ మునందలి ఇతిహాసముల నాధారముగ చూపి, ధృవపరచ గలము. యూరోపియనులు మనలను, "మీ స్త్రీయొక్క విలువ తెలియదు. ఆమెను గౌరవించుటను మీరెరుగరు; మీతోపాటు ఆనంద - వినోదములలో ఆమెను పాల్గొన నివ్వరు, ఆమెను వంటయింటి కందేలుగా నొనర్చిరి. మీకు సభ్యత లేదు." అని ఈసడించినప్పుడు మన వారందరు మారుగా, మనువు మొదలగు వారి గ్రంథములందలి పూజా ర్హాది శ్లోకముల నేకరువుపెట్టి- "మేము మా స్త్రీలను మీవలె ముఖమునకు రంగుపూసి, జుట్టుక త్తిరింపించి, షాంపెయిన్ క్లారెట్ త్రాగించి సభలు, పాట కచ్చేరీలు, నృత్యశాలలలో గంతులు వేయించుచూ తిరుగము. ఇంటియందుంచియే మేము పూజింతుము. మీరు చేయు నాట్యాదులను చూచి మేము సిగ్గుచే తలవంచుకొందుము. వారికి గౌరవమును తెచ్చుటకుగాను అసభ్యముగా వారిని మావెంట వేసికొని, మాతో త్రిప్పి, సభలలో నాట్యమాడించుటకు మేము సమ్మ తించము," అని చెప్పెదరు. కాని పాశ్చాత్యులు దీని నేమా త్రము గణింపరు.

ప్రొఫెసర్ మాస్పెరోగారు ప్రాచీనమిసి దేశ స్త్రీలను గురించి Dawn of civilisation అనే పుస్తకంలో మిశ్రదేశ స్త్రీలు తమ రొమ్ముమీద గుడ్డకప్పుకొనకుండ రోడ్లవెంట తిరి గెదరనిన్నీ, అందువల్లనే వారు అంతటి ఉచ్ఛస్థితికి వచ్చిరనిన్నీ యూరోపియనులవలె ప్రజల పొగడ్తలను పొందవలెనను వాంఛ యేయిందుకు కారణమై వుండవచ్చు(Like Europeans they must have coveted public admiration) ననిన్నీ వ్రాసిరి.

కాని పైరీతిగా చెప్పబడ్డ "ప్రజల పొగడ్త" అనే మాట వినుటకు మన కెంతో సిగ్గువేయును. కాని వారిటుల చెప్పుట కేమాత్రము సంకోచింపరు. ఇంచుమించుగా మనం చెప్పెడి "జనసమూహంలో మాస్త్రీలతో నాట్యము చేయించుటను మేము సభ్యతగ తలచము—వారిని వంటయింటి కుందేళ్ళవలెనే వుంచి పూజింతుము" అను మాటలుకూడ దీని వలె లజ్జాకరము లేయని మనకు తోచదు. ఇటువంటి జవాబులతో మనకానమయమున కుపరించు మనువు, పరాశరుడు మొదలగు వారి కొన్ని శ్లోకములను ప్రమాణముగ చూపి వారిని మాటలలో జయించుటకు ప్రయత్నించెదము.

పోనిండు. పాశ్చాత్యులను నమ్మించుటకు ఏవోకబుర్లు చెప్పితి మనుకొందము. కాని మనయింటికివచ్చి మనలోమనం ఇంత వరకు బయటివారితో ప్రగల్భములుగ జెప్పుకొనిన స్త్రీని మేము యింటియందు పూజింతుము. అనునది ఎంతవరకు సత్యము? ఆమెను మనమేరీతిని పూజించుచున్నాము?—అని మనలో మనము ప్రశ్న వేసి చూచుకొనినచో మనబండారము బయట పడగలదు.

స్త్రీకి పాతివ్రత్యమే అన్నిటికంటె శ్రేష్ఠమైన గుణమని చెప్పుట నెవరునుకాదనజాలరు. భర్తఎంతటిదుష్టుడైనకానిమ్ము; అతని ఆజ్ఞోల్లంఘనమే. అతనిని సేవగించుకొనుటయే, స్త్రీకి అన్నిటికంటె గొప్పసద్గుణము. పాతివ్రత్య మెంత మహత్తరమైనదో రామాయణ,భారతాది గ్రంథములం దతివిపులముగ వర్ణింపబడినది. అంతేగాదు దేవుడంతటివాడు గూడ పాతివ్రత్య మహాత్మ్యమునకు లొంగిపోయెను.

కాని మన శాస్త్రకారులు పై మంచిచెడ్డలను స్త్రీల కొరకే ఏర్పరచిరి. కాని పురుషులకొరకొక్క నియమమైనను

ఏర్పరచకపోగా, పైశాచిక వివాహమునుకూడ వివ ఆర్యులే
అంగీకరించిరి. చూడగా మన శాస్త్రకారులు అరణ్యమునకేఁగింప
తపస్సొనర్చుకొనుచూ, లోకముతో సంబంధము లేనివారై
యుండికూడ తాము పురుషులై యుండుటచే పురుష పక్ష
పాతమును చూపుటకే యిట్లొనర్చినట్టుల కాన్పించుచున్నది.
అట్టి విధముగనే జరుపకున్నచో మనపురుషులే నవయుగమున,
యిరువదవ శతాబ్దిలోకూడ విధవా వివాహము శాస్త్రసమ్మ
తమా? కాదా? యని శాస్త్ర గ్రంథములను తిరుగవేయుటకు
ప్రయత్నించరు. అంతేగాక తమకు విరుద్ధముగా నున్నచో
వీటి నన్నిటిని బహిష్కరించి నూతనముగ సృష్టించుటకు కూడ
వెనుకాడెడివారు గారు. కాని, పాశ్చాత్యులో-ఇట్టి పురుష
పక్షపాతులుగాక స్త్రీ పురుషు లెల్లరకు శీలము (Chastity)
ఆవశ్యకమని చెప్పికొని తమ సమదృష్టిని లోకమునకు చాటిరి.

రాగా రాగా మనవారి పాతివ్రత్యముయొక్క పరమా
వధిని భర్తతో పాటు సహగమనము నొనర్చుటవరకు తీసికొని
వచ్చి, స్త్రీలయందు తమకెంత అసూయాభావము కలదో
బయటపెట్టికొనిరి.

ఇతిహాసాల్లో మన కెక్కడాకూడ, ఈ సహగమన
మనేది ఎప్పుడు ప్రారంభ మయిందో తెలిసికొనేందుకు ఆధా
రాలు లేవు. కాని, రామాయణంలో దశరథుడు మరణించి
నప్పుడు కౌశల్య సహగమనం చేసుకోబోగా వారించిరనిన్నీ,
మహాభారతంలో మాద్రి పాండుమహారాజుతో సహగమనం
చేసినదనిన్నీ తెలియుచున్నది. కురుక్షేత్ర యుద్ధానంతరం
కొంతమంది సహగమనంచేశారు, కాని వారుకూడ చాల
తక్కువే. ఇంతకు మినహా మనకే గ్రంథాల్లోగాని, మరెచ్చట
గాని యిందునుగురించిన ఆధారాలుఅధికంగా దొరుకుటలేదు.

చూడగా 'సహగమనమును గురించి తెలిసియుండి మాత్ర తప్పక చేసి తీరవలెనని ప్రారంభంలో పురుషులు స్త్రీలను ఒత్తిడి చేసెడివారు కారని తెలియగలదు.

అంతేగాకుండ, ఈ ఆచారము అనాగరిక జాతులలో ఎక్కువగ వ్యాపించియున్నదని చెప్పుటకుకూడ మనకు కొన్ని ఆధారములున్నవి. ఈరీతిని సహగమనముచేసిన స్త్రీల కీర్తి స్తంభాలు దక్షిణదేశమందసంఖ్యాకంగా కనిపించగలవు. ఫిజి ద్వీపంలోనూ, ఆఫ్రికాలోనూ కూడ యీ ఆచారము చాల వ్యాపించియున్నది. ఆ సమయమందీ దేశీయులు తమ డాహోమీ సరదారులు మరణించినప్పుడు వారి చితికి నలు వైపుల సరదారుయొక్క వందలకొలది భార్యలను చెట్లకు వ్రేలాడగట్టి ఉరిదీయుచుండెడివారు. మరణించినవానికి పరలోకంలో పరిచర్యలు చేయుటకు ఎవరైనా ఉందురో - ఉండరో -యనిన్నీ, కాబట్టి వారితోపాటు వారి భార్యలను కూడ పంపించినచో వారి కేవిధమగులోటున్నూ రాదనిన్నీ, వారి నమ్మిక. కాని అదృష్టవశాత్తు కీర్తి స్తంభములను నాటు ఆచారము ఆదేశములలో వ్యాపించలేదు. అటులే జరిగినచో ఈ సరదారుల వందలకొలది భార్యల కీర్తిస్తంభములు నాటుటకు చోటులేకుండెడిది. మనవారి ఆశయముకూడ యిదే అయివుండవచ్చునని తోచుచున్నది.

అశోకచక్రవర్తి రాజ్యకాలమందు దాలని రాజ్యమును చూచినవారు 'సహగమన'మను నాచార మా కాలమున లేదని వ్రాసిరి. కాని అతని సమయమున దాక్షిణాత్యులలో మాత్రమీ ఆచారము గలదు. దాక్షిణాత్యులను అనాగరికులుగ ఆర్యులు తలచుచుండెడివారు. కాని అనాగరికులైనప్పటికి, వీరి యీ ఆచారము, వారికి శ్రేష్టమైనదిగ కనబడుటచే

వారుకూడ ఈ ఆచారమును వీరినిచూచి నేర్చుకొనిరి. ఆర్యులీ ఆచారమును అమలులోనికి తెచ్చిన వెంటనే, చితిపైనెక్కింప బడిన విధవలను చూచినచో స్పెయిన్ రాజు ఫిలిప్‌కు కూడ వీరిపై భ్రాంతి కలిగియుండెడిది.

దురదృష్టవంతురాండ్రగు స్త్రీల నీరీతిని సహగమన మనెడి పేరుతో హత్య చేయసాగిరి. కాని మొదట ఒక పెద్ద సంశయము కలిగినది. తన వంశక్షేమానికై తనయింటికి తెచ్చుకొని,—ఆమె కొరకు, అబద్ధములు, దొంగసాక్ష్యములు, మోసములుచేసి ప్రాణములు కోల్పోవుటకుకూడ వెనుదీయని ఇట్టి ఉపయోగకర వస్తువును చంపుటెట్లు? దీనికి నేక కారణములు గలవు అందులో ప్రధానమైనవి. 1. పరలోకములో భర్తకు సేవ చేయున దెవరు? 2. దురదృష్టంవల్ల విధవఅయిన యీ స్త్రీవల్ల ఇప్పుడేమి లాభము గలదు? ఒకవేళ యీమె జీవించియుండుటచే ఏవిధమైన అశాంతిగాని ప్రబలుచో అప్పుడేమి చేయగలము? కావున దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలెనన్న రీతిని, అట్టి అశాంతి రాకపూర్వమే ఆమెను హత్యచేయుట మంచిది. భార్య రూపమున నీ విధవ మరెవరికినీ ఉపయోగపడదు గదా! మాతృరూపమున మాత్రమీమె కావలసివచ్చును. దీనినిగురించి తరువాత యోచించవచ్చును.

ఇతిహాసములను చదువుటచే ఏ దేశమునకూడ విధవా వివాహమును గౌరవించినటుల కానరాదు. ప్రతిదేశీయులు ఏదో వకరీతిని విధవా వివాహమును అగౌరవముగనే తలంచుచుండిరి. అదిన్నీగాక మరణించిన భర్తయొక్క ఆత్మ సమీపమందే కూర్చొని తన భార్యకై ఎదురుచూచుచుండు ననిన్నీ, అతనికి భార్యావియోగ దుఃఖము కలిగించుట ధర్మము కాదనిన్నీ, అందువలన భర్తతోపాటు భార్యనుకూడ పర

లోకమునకు పంపినచో మరణించిన భర్తను సుఖపెట్టగల దనిన్నీ తలచి అనాగరక జాతులవారు భార్యను భర్తతో పాటు చంపుచుండెడివారు.

ఆత్మ, పరమాత్మలను గురించి పూర్ణజ్ఞానమును గలిగి వీటియొక్క స్వరూప నిర్ణయమును కూడ చేసియున్న భారత దేశములాంటి నాగరిక దేశము లోకూడ యిట్టి దురాచారము ప్రబలుట ఆశ్చర్యకరమే !

పురుషులు స్త్రీని సహగమన మొనర్పచేయుట తన పరమ ధర్మమనిన్నీ, యిహపరలోకములలో పతిసేవ చేయుటయే ఆమె యొక్క కర్తవ్యమనిన్నీ, భర్త పరలోకములో నున్నప్పటికి, ఆమె ఎడబాటును సహింపజాలక భార్యకై ఎదురు చూచు చుండుననిన్నీ, అట్టి భర్తకు ఎడబాటుచే గలుగు దుఃఖమును కలిగించుట మహాపాపమనిన్నీ మొదలుగాగల మోసపుమాట లను చెప్పి ఆమెను వంచించిరి. ఇంతేగాదు. యిట్టి మోసపు మాటలను చెప్పిన మనుమహర్షి పరలోకంలో స్త్రీ, భర్త కెప్పుడు, ఏరీతిని సేవ చేయగల రోవివరించక స్త్రీలను వం చించెను. శాస్త్ర గ్రంథములుకూడ మాతృత్వ ప్రాప్తి పొం దని స్త్రీ జీవితము వ్యర్థమని చెప్పి స్త్రీలను వంచించినవి.

వీటి వన్నిటిని బట్టిచూడ పురుషుడు కేవల తనసౌఖ్యం కొరకై — అది వాస్తవికముగ నిండు, - కల్పితముగానిండు స్త్రీని భోగవస్తువుగ సృష్టించుకొని, తానుచేసెడి యీ వంచ నను వారు తెలిసికొన జాలకుండుటకు వారిని గొప్పగా పొగ డుచు అనేక గాథలను, కీర్తిస్తంభములను సృష్టించి అప్పటికి కూడతృప్తిపొందక, 'మాస్త్రీలు ఆనందముతో తమభర్తలతో పరలోకమున, ఆతని సేవచేయుటకై పతిచరణములను ఒడియం

దినుకొని, చితిపై కూర్చొని ప్రాణములను త్యజించెదర'ని చెప్పి స్త్రీలను మోసపుచ్చిరి.

నిజంగా మీరు చెప్పినటుల యీ స్త్రీ మనస్ఫూర్తిగా భర్తపాదములను ఒడియం దుంచుకొని సంతోషముతో చితిపై కూర్చొని పరలోకమున భర్తసేవ చేయుటకు వెళ్లెడిదగుచో, ఆమెకు భర్త మరణించగానే ఉన్మత్తరసము, గంజాయిలను త్రాగించు టెందులకు? చితిపైన ఆమెను వెదురుగడలతో కట్టివేయుటెందులకు? చితిపై గుగ్గిలము, నెయ్యిపోయు టెందులకు? చితి మండునపుడు తప్పెటలు, తాళములు వాయించుట; శంఖములు పూరించుట మొదలగున వెందులకు? ఇవన్నియు ఆమెచే సహగమనమును ఒత్తిడిచేసి చేయించుట కేగదా! ఆమె ఏడ్పులు పెడబొబ్బలు విని యితరులకు జాలి భయము కలుగకుండుటకు గాదా? ఇదేగదా మీరు చెప్పు సహగమనం!

పై ప్రశ్నలకు మీరు మమ్ము పరిహసించ వచ్చును. పిచ్చి ప్రశ్నలనవచ్చును. ఏదో రీతిని సమాధానమిచ్చి మమ్ములను తృప్తి పరచవచ్చును. కాని యిటుల చేయుటాతయు తనను తాను వంచించుకొనుటలాంటిదే!

మనము వేదాంత సాంఖ్యాది శాస్త్రవేత్తలము. జన్మ పునర్జన్మల జ్ఞానముగల వారము. దేవయాన పితృయానలను ఒప్పుకొనువారము. ఇహలోక కర్మలననుసరించి భవిష్యత్తును స్థావర జంగమ పశ్వాది యోనులందు జన్మించెద మనెడి సిద్ధాంతమును నమ్మెడి వారముగదా! ఇట్టిస్థితిలో ఎట్టికర్మలు చేసినప్పటికి రెండు ప్రాణులను ఒకదానితోపాటు మరొక దానిని తగులవేసినచో అవిరెండును ఒకదానితో మరొకటి కలసియుండునని ఏశాస్త్రము చెప్పును? ఈవిశ్వాసము పైన

మీరు చెప్పేకీ సిద్ధాంతములకు పూర్తిగ విరుద్ధమని మీరు వొప్పుకొన నవుసరం లేదా?

మొట్టమొదట యీ సహగమనాన్ని నిషేధిస్తూ శాసనంచేసినప్పుడు ఎన్నో సభలుచేసి చట్టాన్ని రద్దుచేయవలసిందనిన్నీ రద్దుచేయనిచో హిందూధర్మము సమూలముగా నాశమగుననిన్నీ అప్పీలుచేసిరి. చూచితిరా! మనవారి స్త్రీపూజ!

కాని, వీరి ప్రార్థనలను ప్రీవీకౌన్సిలువారు త్రోసి పుచ్చిరి. అందువల్ల మనవారిఆటలు సాగలేదు.

ఇక పురుషులు మరొకమార్గాన్ని స్త్రీలను వంచించుటకు వెదకసాగిరి. ప్రభుత్వం మ్లేచ్ఛ ప్రభుత్వం కావటంవల్ల మన ఆచారాన్ని నిషేధిస్తూ శాసనంచేసింది. కాని, దీనిని ఏ రీతినైన కాపాడి విగత భర్తృకలైన స్త్రీలయొక్క సతీత్వమును కాపాడుట మనధర్మము. అందుకై మనము ప్రయత్నము చేసి తీరవలెనని ప్రజల్లో ప్రచారం సాగించారు. అంతటితో వూరుకొనలేదు. శాస్త్రగ్రంధాల్లో ఎక్కడో, మూరుమూలల్లో పడివుండి, ఎన్నడూ ఆచరించని కొన్ని శ్లోకములను ప్రమాణాలుగా చూసి భర్తను కోల్పోయిన స్త్రీ ఆభరణములు ధరింపరాదు. రోజుకు వకమారు మాత్రమే భోజనము చేయాలి, ఒడలు దాచుకొనకుండ రాత్రింబవళ్లు కష్టించి పనిచేయాలి, అంచులులేని బట్టను కట్టుకోవాలి, మంగళ కార్యాదులు జరుగునప్పుడుగాని, వివాహ సమయమందుగాని, ఎదురుగా రాకూడదు, మొదలైన నియమాలెన్నిటినో స్త్రీల (భర్త మరణించిన) నెత్తిపైన రుద్ది జీవించియున్నప్పటికి మరణించిన దానితో సమానముగ నుండులాగున చేసిరి. ఇటులచేసి 'మా దేశంలోలాగ మరేదేశమందైన

సతీత్వమును కాపాడుకొను స్త్రీలు గలరా? అని పరిగల్భ
ములు పలుకుచు చెప్పుకొనసాగిరి. ఇట్టి విధమును చివరకు
'వంటలక్క'గ మాత్రము పనికివచ్చునని వంటయిల్లే ఆమెకు
రాత్రింబవళ్లు నివాసమగులాగుచ చేసి, వారిపైగల తమ కసిని
కొంతవరకు తీర్చుకొనిరి.

పురుషుడు ఎంత పెద్దవాడైనప్పటికి ద్వితీయ, తృతీయ
కాదు, ఎన్నెని పెండ్లిండ్లు చేసికొనవచ్చు. కాని స్త్రీ మాత్రి
మట్లు కాదు. ఆమెకు బాల్యమందే పది పండ్రెండేడ్లప్పుడు
భర్త మరణించినను జీవితమంత విధవ వలె జీవితము గడుప
వలసినదే. కాని, పురుషుడో తనకు బిడ్డ లున్నప్పటికి నలుబది
యేబదియేండ్లవాడై నప్పటికి, ఇచ్చగలుగుచో పెండ్లాడ
వచ్చును. తన పడుచు పెండ్లముకు బాల వితంతువగు తన
కూతురుచే సమస్త విధముల చాకిరి చేయించవచ్చును.
కాని స్త్రీ, బాల్యమందే సంసారసుఖమన నేమో తెలియ
కుండగనే రజస్వలయైన కాకపూర్వమే భర్తను కోల్పోవుచో,
తన జీవితము నంతను అడవిగాచిన వెన్నెలవలె వ్యర్థముచేసి
కొని, తన జీవితమున వసంతఋతు వనెడిది స్వప్నసౌఖ్యముగ
నెంచి, జీవితము నంతను దుఃఖముతో గడుపుచూ, స్త్రీకి, సహ
జముగ గలుగు ఏ విధమగు కోరికను నెరవేర్చుకొనుటకు అవ
కాశములేక నశించి పోవలసినదే! చూచితిరా! మనవారు
స్త్రీలను గౌరవించు విధానము! ఇదే, మన స్త్రీ ఆదరణ, స్త్రీ
పూజ. స్త్రీని తమ కామమును తీర్చుకొనుటకుగాను ఏర్పడిన
ఒక పరికరముగా నెంచుచున్న, మనవారి స్త్రీపూజ పూజ
యగునా? కాదు. కాదు. ముమ్మాటికీ కాదు. ఇది స్త్రీలపై
చూపు ఆదరణకు చిహ్నముగాదు; స్త్రీలను తామెంత హీన
ముగ తలంచుచుండిరో తెలిసికొనుటకు పనికివచ్చు చిహ్నము.

పోనిండు. నేటి కాలంలోకూడ అచ్చటచ్చట, మన దేశములోనే కొందరు స్త్రీలు, భర్తయొక్క మరణవార్త విగనే బుద్ధిపూర్వకముగ మరణించిన చరిత్రలు కొన్నిగలవు. తెలిసిగాని, తెలియకగాని, బలాత్కారంగాగానీ బుద్ధిపూర్వకముగగానీ యీవిధముగ స్త్రీ సహగమనమొనర్చుచో అందువలన స్త్రీలపై పురుషులకు గల గౌరవభావము దివెల్లడికాగలదను మాటలలో అర్థమేమైన నున్నదా? ఎంతటి వెఱ్ఱివాడైన యిదినమ్మునా? నమ్ముటకు తగిన ఆధారమిందేమైన గలదా?

స్త్రీ సహజముగ తా నాశ్రయించుకొనియుండు భర్తకు సంతోషమును కలిగించుటకై ప్రయత్నము చేయవలెనని ఆశించును. అదేరీతిని మీరు ఒక స్త్రీ సహగమన మొనర్చినచో ఆమెను గొప్పగా పొగడి, ఆమెను పొగడుచు పాటలు, పద్యములు వ్రాసి, ఆమెవలె చేయుటయే స్త్రీయొక్క పరమ ధర్మమని చెప్పు మాటలను నమ్మి మోసపోవునటుల చేసినది మీరు కాదా?

సాధారణముగ భర్త మరణించినది తడవుగ స్త్రీకి తన జీవితముపై రోత పుట్టి ఆత్మహత్య చేసికొనవలెనని ఏవిధముగ అనిపించునో చూచినవారికే తెలియగలదు. ఒక స్త్రీ మేడపైనుండి దూకిచచ్చుటను, మరొకతె ఉరిపోసికొనిచచ్చుటను చాలమంది విషయమును త్రాగి చచ్చుటను నేనుచూచియున్నాను. ఈఆత్మహత్యలను గురించి వ్రాయుచూ శైలరు ద్వార, ఆఫ్రికా యందలి సరదారులను భార్యలను భర్తలు మరణించుననెడి సూచనలు కనిపించుచున్నప్పుడే ఉరితాళ్ళను వెదకి, భద్రపరుచుకొని యుండెడివారనివ్రాసెను. హెర్బర్ట్ స్పెన్సరుద్వార, ఫిజీద్వీపంలోని సర్దారుల భార్యలు భర్తమర

ణించగనే యితరులచే గొంతుక పిసికించుకొని చచ్చుచుండెడి వారనియు, దీనిని చాల గొప్ప పుణ్యకార్యముగ వారుతలచెడి వారనియు యిట్టుల చేయుచుండ, ఏవరైన అడ్డగించుచో వారు పొందెడి కోపమునకు హద్దుండెడిది కాదనియు వ్రాయుచూ, యీ విధముగ వివరించెను.

"The wives of Fijian chiefs consider it a sacred duty to suffer strangulation on the deaths of their husbands. A woman who has been rescued by william escaped during the night, and swimming across the river and presenting herself to her own people tnsisted on the completion of the sacrifice which she had in a moment of weakness reluctantly consented to forego and wilkes tells of another who loaded her rescuer with-abuse and ever afterwords manifested the most deadly hatred towards him.

(ఫిజీ ద్వీపమందలి సరదారుల భార్యలు, భర్తమరణానంతరము తమ గొంతుక నులిమించుకొని చచ్చుట నొక పవిత్రకర్మగా తలచుచుండెడివారు. విలియం వకసారి యిట్టి స్థితిలోనున్న ఒక స్త్రీని తప్పించెను. ఆవిడ తనమనోదుర్బలతచే అంతకు పూర్వము జీవించవలెనని ప్రయత్నించియుండి కూడ ఆరాత్రి మరల ధైర్యము తెచ్చుకొని, రాత్రిసమయమున నదినిదాటి ఆవలివడ్డునకు పారిపోయి హత్యాకాండను నెరవేర్చ వలసినదిగా తనజాతివారిని ఒత్తిడి చేసెను. విల్క్స దొర, "ఇదేరీతిని ఒకతె తనప్రాణములను కాపాడిన ఒకనిని అనేకములగు తిట్లుతిట్టి జీవించినన్నాళ్లు ఆతనిని ఏవగించుకొనుచుండెడిది"ని తనఅనుభవము నొకచోట వ్రాసెను)

వీటినన్నిటిబట్టి చూడగా సహగమన మనునది స్త్రీలకు గౌరవ కరముగ ఆ కాలమున తలంచుచుండెడి వారని తెలి

యుచున్నది. ఈ గౌరవ మొక్క ఆర్యజాతి స్త్రీలు మాత్రమే పొందుటకు హక్కుదారులు గారు. ఎందరో నీచజాతి స్త్రీలు కూడ ఈరీతిని చేయుచుండిరి. వారుకూడ ఈరీతిని చేయు చుండిరి. వారుకూడ ఈరీతిని గౌరవమును పొందదగ్గవారే గదా!

ఇంకను చూచినచో స్త్రీలు పురుషుడేది చెప్పిన అది ధర్మముగను, పురుషుడు చెప్పిన రీతిని చేయుటయే తనకు గౌరవనీయముగను తలంచుచుండిరని కూడ తెలియగలదు. ఇంతేగాక తమకు గల న్యాయమైన కోరికలను తీర్చుకొను టకు కూడ, పురుషుని అగౌరవ పరచి ధర్మమును తప్పిన వార మగుదుమేమో యనెడి భయముచే వెనుకంజ వేయు చుండెడివారు. ఇటులచేసి తమ సుఖత్యాగముచే, పురుషుడు పొందు సుఖమునే తమ సుఖముగ నెంచి, తాము సుఖపడు చుండెడివారు. ఇదే తమకు గౌరవమనిన్నీ తలచెడివారు.

పైరీతిని చేయుటవలన స్త్రీకిగల గౌరవ మధికము కావచ్చు! కాని, పురుషునకో? తాను స్త్రీని తన చేతియందలి కీలుబొమ్మగ, తన బానిసగ నొనర్చుకొనుటే తనకు గౌరవ నీయమని ఎంత అధికముగ తలంచు చుండునో అంత. అధిక ముగ తన గౌరవమును కోల్పోవుట లేదా?

సహగమనము నెందుకు సృష్టించిరని యడుగుట తడ వుగ, పరలోక సుఖము కొరకందురు. మీలో ఎందరికి పర లోకమును గురించి తెలియును? మీ పరలోకమును గురించి గల శాస్త్రములలో, యిద్దరు ప్రాణుల నొకేతూరి తగుల వేయుచో, ఇద్దరికీ నొకేలోకము లభించునని ఎచ్చటనైన గలదా?

పురుషులు తమ కిట్టి అన్యాయము, అనాలోచితము,

కఠోరములైన నియమములను ఏర్పరచినప్పటికి, అదేమి చిత్రమోగాని పురుషునిపై గౌరవము, విశ్వాసము భక్తి శ్రద్ధలను (స్త్రీలు) చూపుచునే వచ్చిరి. అంతేగాక పురుషు లిట్టి నీచులు, వంచకులు, పరుల సౌఖ్యమును చూచి ఓర్చు కొనలేని వారనెడి భావముచే కలిగి యుండలేదు. స్త్రీయొక్క విలువ, గౌరవము, పవిత్రత లిందే దాగియున్నవి.

'బిల్వమంగళము'ను నొక నాటకముగలదు. ఇది చాల సంగరములనుంచి బహిరంగముగ రంగస్థలముపై ఆడబడు చున్నది. దీనిని చూచుటకై ఎంతో ధనమును వ్యయపరచి వెళ్ళెదరు. అంతేకాదు; ఈ నాటకము నెంతో గొప్పగా ప్రశంశించెదరు. అందులో నిగూఢములగు ధర్మవిషయములు గలవనిన్నీ, అందువలన నిది ప్రశంసాపాత్రమనిన్నీ, వీరి అభిప్రాయము.

ఇందు— ఒక వణిజుడు విషయలోలుడగు నొక అతిథిని తృప్తిపరచుటకై, తనభార్య నాతని తోడ్తుగా పంపించుట యను విషయముగలదు. ఈ వణిజుడు, తనయింటినుండి అతిధియనువాడు విముఖుడై వెళ్ళరాదనిన్నీ, అతనిని తృప్తి పరచుటకై తానెట్టి త్యాగమునైన చేసెదననియు, తన ప్రతిజ్ఞా భంగము, తాను యమదూతల చేతులందు పడవలసి వచ్చునేమో యని భయపడుచున్నాననియు'' దీర్ఘోపన్యాస మిచ్చును. శాస్త్రములలోకూడ దీని కనుకూలముగ అతి ధిగా వచ్చు నాతనిని తృప్తిపరచుటకై గృహస్థు తన సర్వస్వ మును యివ్వవచ్చుననియు, చివరకు అతిథి కోరుచో, తన భార్య నాతని తోడ్తుగా పంపి తృప్తిపరచుటకు కూడ గృహస్థు వెనుకాడరాదనియు, అటుల అతిథిని తృప్తిపరచి పంపించని గృహస్థు నరకగుండమున పడుననియు చెప్పుచున్నవి. పతివ్రత

యగు స్త్రీ, తన భర్తకు పుణ్యలోకములను కలిగించుటకై ఎన్నడును ఎరుగని ఒక పాపిష్ఠుడగు అతిథి తృప్తికై ఆతని తొత్తుగా పోవుట యనునదేగదా స్త్రీపై పురుషుని చూపు గౌరవము! ఇదేనా, ఆమె పాతివ్రత్యమునకుగాను మారుగా పురుషుడిచ్చు గౌరవము!

కాని మాయీవాదన బిల్వమంగళుని భక్తులైనవారు ఖండించవచ్చును. అంతేగాదు, అతిథి తృప్తికై తన ప్రాణము లనైన కోల్పోవుటకు హిందూ గృహస్థు వెనుకాడ డనవచ్చును. దాతయగు కర్ణుడు అతిథి తృప్తికై తన పుత్రుని ప్రాణముల నిచ్చుటకు కూడ సంకోచించలే దనవచ్చును. మాకిదంతయు తెలియును. దాతయగు కర్ణుడును, యీవణిజుడును గొప్పపనిచే చేసిరి. కాని ఇది కాదు. తానుగొప్పత్యాగి యగుచో తనప్రాణములను త్యజించ వచ్చును. అంతేగాని తన అధికారమునకు లోబడియున్న తనభార్యను, తనబిడ్డలను తాను ఇచ్చుటేమి ధర్మము? స్త్రీ నాసొమ్ము. నేను ఆమెకు యజమానిని, కావున నాకు కావలసి వచ్చినప్పుడు లేక నాకు బుద్ధి పుట్టినప్పుడు నారీ ధర్మమును దుర్వినియోగము చేసికొనుటకు నాకు అధికారము గలదు. అంతేగాదు ఆమెను బ్రతుక నిచ్చుటకు చంపుటకు, దానము చేయుటకు. నాకు హక్కు గలదనుట మాత్రము తప్పు. మీ యీ స్వేచ్ఛాచారిత్వము మీకేగాదు, మీ పురుషజాతిని కూడ హీనముగ నొనర్చినది. దీనితోపాటు మీ భార్యను, నారీజాతినంతను అవమానము చేసినది.

అతిథిసేవ చాల గొప్పధర్మము కావచ్చును. కాని, అందుకొరకు మనము దొంగతనము చేయుట సరిగాదుగదా! అదేరీతిని భార్యనుకూడ, యూదులు పశువుల వలె అనాగరిక

జీవనము గడపునప్పుడు తమ ఆస్తి పాస్తులు, గొడ్లు గోదతో పాటు భార్యలనుకూడ (అన్నదమ్ములు) పంచుకొను చుండెడి వారు. స్త్రీ జాతిని గురించి ఈవణిజనకు గల అభిప్రాయము గూడ అట్టిదే అయియుండును. అతిధి సత్కారమనునది పతి వ్రతా స్త్రీ, తన మానమును కోల్పోవుట కంటె పరమధర్మ మని ఎంచి నేడుకూడ ఆరీతిని ఎవరైన చేయుచున్నచో అట్టి వారిని నీచులనుట మంచిది కాదుగదా!

అమెరికా యందలి 'క్షణికు'లను అసభ్యజాతివారిని గురించి కెప్టెన్ లూయిస్‌గారు వ్రాయుచూ "వీరు అతిధి సత్కారార్థము, అతనితో శయనించుటకు తమయింటియందలి శ్రేష్ఠమగు కన్యను పంపుచుండెడి వారనియ్యు, యింటియందు కన్యకలు లేనిచో తమ భార్యను పంపించుటయే పరమ ధర్మ మని తలచెడివారనియు" వ్రాసెను. మరొకచోట ఆసియా యందలి చుక్‌చీ జాతినిగురించి ఆర్మైన్ ప్రభువు వ్రాయుచూ "The Chuckchee offer to travellers, who chance to Visit them, their wives and also what we should call thier daughters honour" (చుక్‌చీ జాతీయులు తమ యింటికి వచ్చు అతిధులను గౌరవించుటకై తమ భార్యలనేగాదు, తమ పుత్రికలను గూడ వారితో క్రీడించుటకు పంపుచుండెడివారు.)

కెప్టెన్‌లయిన్, సర్ జాన్ లబక్‌గారలు ఎస్కిమోజాతి, కవస్కటకా నివాసులు, మరియు కాలీముఖులను గురించి వ్రాయుచూ "వీరుకూడ యిదేరీతిని అతిథిని పూజించుచుం డెడివారని వ్రాసిరి. అంతేగాదు; హెర్బర్ట్‌స్పెన్సర్ తన 'Descriptive Sociology' లో ప్లినీ, పాలెస్‌దొరలు దేశా టనముచేసినప్పటి అనుభవములనుండి యీలాటి కరుణాజని

తములగు వృత్తాంతములను, ఎన్నింటినో ఉల్లేఖించెను. ఈ రీతిని అతిథిపూజ చేయుటయే పరమధర్మముగా ఎంచెడి యీ అనాగరిక జాతివారికిని బిల్వమంగళ మండలి వణిజునకుగల భేదమేమి? యిందుమీరు "మేము" అతిథిని, అసంతోషముగ పంపమని గర్వముగా చెప్పుకొనగల విషయమేమిగలదు? అతిథి సత్కారము చేయుటలో గర్వముతో చెప్పుకొను, మీ కంటె వారేమాత్రముకూడ వెనుకబడి యుండలేదనుటను మీరు కాదనగలరా? లేరు. అసంభవము. మీయీ గర్వపు మాటలలో స్త్రీ గౌరవమనునది మచ్చునకైన గలదా? మీరు వున్నదని నిదర్శనములను చూపగలరా?

శంకరాచార్యులు ఆతుదానిని 'నరకమునకు తోరణము అని స్పష్టముగ చెప్పెను. బైబిలులోకూడ' స్త్రీ' సర్వానర్థములకు మూలము'ని గలదు. యూరోపునందలి ప్రసిద్ధుడగు లాటిన్ ధర్మాచార్యుడగు టెర్టులియన్ స్త్రీనిగురించి వ్రాయుచూ "Thon art the devil's Gate, the betrayer of the tree, the first deserter of the Divine Law" (నీవు పైశాచిక ద్వారమువు. నీవు దైవీయ నియమములను, ధర్మములను వంచన మొనర్చుటలో మొట్టమొదటిదానవు.) ప్రసిద్ధుడగు సెంట్ ఆగస్టిన్ తన శిష్యులకు "What does it matter whether it be in person of mother or of sister we have to beware of Eve in every woman,' (స్త్రీ తల్లీకానిమ్ము, సోదరికానిమ్ము, ఆమె పాపమునకు నిలయమనెడి విషయమును జ్ఞప్తియందుంచుకొని జాగ్రత్తతోనుండవలెను) అని బోధించుచుండెడివాడు.

సెంట్ ఎంబ్రోజ్ 'Remember that God took a rib out of Adam's body and not a part his Soul to make herof.

(దేవుడు స్త్రీ) (పాపము) నిర్మాణమునకై తన హృదయమునుండి ఏవస్తువును తీసికొనలేదు. ఆదమ్ లేక పురుషుని శరీరమునుండి ఒక (ప్రక్కటెముకను తీసికొనెను) అనిచెప్పెను.

క్రీ. శ. 578 లో జరిగిన క్రైస్తవసంఘ సమావేశములో స్త్రీ శరీరములో ఆత్మవుండదని నిర్ణయించిరి. ఏ ధర్మమునకై స్త్రీ చచ్చుట—బ్రతుకుటలకు సంసిద్ధమైయున్నదో, ఏ ధర్మ గ్రంధములందలి ప్రతి అక్షరమును స్త్రీని అమితగౌరవముగ గౌరవించుచున్నదో, అట్టి ధర్మగ్రంధములలో స్త్రీ ఏరీతిని పురుషులచే అవమాన పరుపబడినదో చూచితిరా?

ఇంతతో పోయినదా? లేదు. మధ్యయుగమందలి ప్రసిద్ధుడగు సెంట్ బర్నర్డ్ తన తల్లిని ఒకపాటలో యీరీతిని సృష్టించెను; "What have I to do with you? what have I received from you but Sin and misery? Is it not enough for you that you have brought me in this miserable world:- Chat you being Sinners have be gotten me in Sin"

'నీతో నాకేమి పని? నీవల్ల నాకు పాపము, కష్టముల కంటె, ఏమి అధికముగ లభించినవి? నన్ను ఈపాపరూపమగు ప్రపంచమున పడవేయుటతో, నీకు తృప్తికలుగలేదా? మీరు (స్త్రీలు) పాపులు, పాపముతో జన్మింపజేసిరి.

చూచితిరా! స్త్రీల నధికముగ గౌరవించవలెనని చెప్పు పాశ్చాత్యులు, ఒకనాడు స్త్రీల నే రీతిని గౌరవించుచుండెడివారో!

...ఈవిధంగా స్త్రీని అవమానకరంగా చూస్తూవుండే పాశ్చాత్యులు, నేడు సగర్వంగా స్త్రీని మేము గౌరవించినంత ఎక్కువగా లోకంలో ఎవరూ గౌరవించటం లేదని చెప్పెదరు. కాని 13-14 వ శతాబ్దాల్లో వీరు స్త్రీలను ఎంతగా ఏవగించు

కొనేవారో, ఆనాటి Sacredotal celibecy ని గాని, చర్చికిసంబంధించిన చరిత్రల్ని గాని తిరగవేస్తే తెలియగలదు. వీటినిబట్టి చూడగా, వీరి యిప్పటి స్త్రీ గౌరవము అనుమాట వేళాకోళపు మాటయేనని తలచవలసి వస్తుంది.

'స్త్రీ నరకద్వారము. స్త్రీలో ఆత్మలేదు. ఆమె పాపమునకు కష్టములకు మూలము' అని తమ సమస్త ధర్మ గ్రంథాల్లోనూ, వ్రాసుకొన్న యీ పాశ్చాత్యులు, స్త్రీని మేము గౌరవించినంతగా ఎవరూ గౌరవించుటలేదు. అని సగర్వంగా చెప్పుకొనే మాటల్ని పై విషయముల నన్నిటిని చదివిన మీదట, ఎవరైనా నమ్మగలరా? నమ్మువాడు మూర్ఖుడు కాడా? ఇందు యిచ్చునకైన సత్యం గోచరిస్తుందా? లేదు. ఇది పరమ స్వార్థంతో నిండివున్నమాట కాదా? ఇది స్త్రీలనుండి తమ స్వార్థాన్ని నెరవేర్చుకొనేందుకు వీరు చెప్పు వంచనతో నిండియున్నమాట కాదా? అవును. అందువల్లనే మిల్ దొర తన Subjection of Women లో దీనిని Isolated fact గా వ్రాసిరి.

మన శాస్త్ర గ్రంథాల్లో ఒక్క మహానిర్వాణ తంత్రంలో మాత్రం "కన్యాప్యేవం పాలనీ యాశిక్షణీయాతియత్నతః" అనే ఒక్క వాక్యంలో మాత్రమే స్త్రీకి చదువు చెప్పించవచ్చునని వుంది. కాని కీ. శే. అక్షయదత్తుగారు తమ 'భారత వర్షీయ ఉపాసక సంప్రదాయము' అనే గ్రంథమందలి ఉపక్రమణికా ఖండంలో తమ అభిప్రాయాన్ని యిందువిషయంలో వెలిబుచ్చుచూ, ప్రాచీనకాలంలో స్త్రీలు వేదములనుకూడా రచిస్తూ వుండేవారని వ్రాశారు. కాని యీ వాదన 'ప్రియా న శ్రుతి గోచరా' అనే ఉదాహరణ ముందు నిలువజాలదు గదా?

యూరపునందలి ఒక ప్రాచీన ధర్మ ప్రవక్త యిందు విషయమై వ్రాస్తూ "Shall the maid Olympias learn Philosophy? By no means. Woman's Philosophy is to obey laws of morriage. (స్త్రీలు దర్శనశాస్త్రము చదువవలెనా? అక్కరలేదు. ఆమెకు వివాహ నియమము లను పాటించుటకు మినహా మరేదియు అక్కరలేదు.)" మార్టిన్ లూథరు "No gown worse becomes a woman than desire to be wise. అని చెప్పుచుండెడివాడు.

ఇదేరీతిని చీనాదేశంలో ఒక సామెత వుంది. దాని అర్థం:—పురుషుడెంత జ్ఞానాధికుడైతే అంత శోభావంతు డగును—అదే రీతిని స్త్రీఎంతఅధికముగ అజ్ఞానవతిగా వుంటే అంత అధికసౌందర్యవతిగా వుండును—

స్త్రీలనుగురించి యింతనీచముగానూ, హేయము గానూ తమ గ్రంథాల్లో వ్రాసుకొన్న యీ విషయముల లోనే 'ఊర్వశివేదము'ను వ్రాసినది. పతిప్రవాసంలో వున్న ప్పుడు దర్శ-పౌర్ణమాసవ్రత సమయంలో భార్య హోమం చెయ్యవచ్చు; బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు-మైత్రేయి, యాజ్ఞవల్క్యుడు గార్గిలసంవాదముల నెందుకు పురుషులు చేర్చవలసివచ్చిందో?

ఆరువేల సంవత్సరాలకు పూర్వం, ఆనాడు నాగరిక దేశాలుగా చెప్పుకోబడే మిశ్రదేశము మొదలగు దేశముల లోగల స్త్రీలహక్కుల్ని గురించి మాన్ పెరో వ్రాయుచూ, Husband is a privileged guest." 'she inherited equality with her brother.'

"Mistress of the house. "Judicially equal of man." having the same rights and being treated in the same fashion.

భార్య యెదుట భర్త గౌరవనీయమైన అతిథి. స్త్రీలకు కూడ తన సోదరులతో పాటు ఆస్తిలో సమాన భాగము వుండును.

ఆమె గృహమునకు యజమానురాలు న్యాయరీత్యా ఆమెకు పురుషునితో సమానమగు హక్కు గలదు. తుల్యముగ గౌరవము నందెడిది. రోమ్ దేశీయులుకూడ యిట్టి నాగరికత కలవారే! అందువల్లనే ఆనాటి, అచ్చటి స్త్రీలుకూడ ఔన్నత్యమును పొందిరి. మేన్‌గారు తన Ancient Law లో యీ Pagan Law యీనాడు ఎందుకు లేకుండాపోయినదో చక్కగా వివరించిరి.

...చదువుకొన్న ప్రతి స్త్రీ సర్ హేన్రీ వ్రాసిన ఆ అధ్యాయాన్ని తప్పక చదువవలసిందని మావిన్నపం.

యూరోపులో వచ్చిన క్రొత్త ఆచారాలు అన్నీ రోమనులనుంచి ఎరువు తెచ్చుకొన్నవే అయినప్పటికీ ఆడవాళ్ళ విషయంలోమట్టుకు యీ నియమాల్ని వున్నవి వున్నట్టుగా వుంచకపోగా ఇంకా ఎక్కువ కఠినమైనవిగా చేసిరి. పురుషులకు ఇలాంటి తమ కొత్త ఆచార నియమాలు ధర్మయుక్తంగాను స్త్రీలకు క్షేమాన్ని చేకూర్చేవిగానూతోచాయి.

క్రీస్తు ప్రభువు లోకాన్ని మరమ్మతు చేసేందుకు ప్రజలు చేయు దుండగాల్ని ఏకరువుపెట్టి వాటిని అన్నింటిని ఖండించాడు; కానిఅదేం పాపమో కాని ఆడజాతి విషయంలో మొగజాతిచేసే అన్యాయాల్ని ఖండిస్తూ ఎక్కడా చెప్పలేదు. కాని జగద్విఖ్యాతుడగు సెంటు పాలుమాత్రం యీలోటును భర్తీ చేశాడు. అంతేగాదు, ఆడవాళ్ళను యింకొక అడుగు వెనక్కికూడా నెట్టేసి ఆయనికి ఆడజాతి మీదగల హేయభావాన్ని వెల్లడిస్తూ యీవిధంగా చెప్పాడు. పురుషుల్లాగధర్మ

విషయంలో ఏవిధంగానూ ప్రశ్నించేందుకు స్త్రీకి హక్కు లేదు. ఆమె ఎల్లప్పుడూ భర్తకు లోబడి వుండాలి. మొగాళ్ళ వుపయోగం కోసం (దేవుడు) ఆడవాళ్ళని సృష్టించాడే కాని, ఆడవాళ్ళకోసం మొగాళ్ళను సృష్టించలేదు. స్త్రీ పురుషునికి శిక్షణ యివ్వరాదు. ఈ ప్రపంచంలో నరకాన్ని సృష్టించింది ఆడవాళ్ళే. అందువల్ల వాళ్ళెప్పుడూ నరకకూపంలో పడి వుంటారు. వాళ్ళు సద్గతి పొందేందుకు వుపాయం ఏదీ లేదు. కాని బిడ్డల్ని కన్నట్లయితే సద్గతి వస్తుంది!!

చూచితిరా! "దేవుణ్ణి చూచిన" సెంటుపాల్ స్త్రీని గురించి ఏమని చెప్పారో? వీరు చెప్పినదాన్ని గురించి యోచిస్తే ఆడది అన, బిడ్డలను కనే యంత్రమనే గదా! ఆపని చెయ్యని ఆడది గొడ్డుమోతు ఆవుతలె నరక యాతనల్ని అనుభవించాల్సిందేగదా!

మనశాస్త్రగ్రంథాల్లో కూడా యిదే రీతిగా సంతానం కోసమే ఆడది సృష్టింపబడ్డదనిన్నీ, పిల్లల్ని కనుట దాంపత్యం యొక్క అర్థమనీ, కనిపిస్తుంది. ప్రపంచంలోగల ఏ దేశపు ధర్మగ్రంథాల్ని తిరుగవేసినా యించుమించు అనుదానిపని! 'యింతే' అని గోచరిస్తుంది.

దీన్నిబట్టి చూడగా ఆడది గౌరవం పొందాలంటే, ఆమె బిడ్డల్ని కనాలనిన్నీ, లేకపోతే, ఆమెకు 'గౌరవము' అనేమాట ఎండమావుల్లాటిదనిన్నీ బోధపడగలదు ఇక, బిడ్డల్ని అందులో కొడుకుని కనజాలని ఆడదాని జీవితంలో 'ఆనందం' అనేది ఆకాశకుసుమమేగదా!

ఈ బిడ్డల్ని కనేందుకు, బిడ్డల్ని కని తన పాపాన్ని పోగొట్టుకొనేందుకు మన ధర్మగ్రంథాల్లో ఎన్నో మార్గాలు చెప్పారు.

తన భర్తవల్ల బిడ్డల్ని కనలేకపోతే, పరపురుషునివల్ల భర్త ఆజ్ఞ పొంది బిడ్డల్ని కనవచ్చు. ఇట్టి బిడ్డల్ని క్షేత్రజాలు అంటారు. కుంతికి పాండవులు, అంబికకు ధృతరాష్ట్ర-పాండు రాజులు యీవిధంగానే పుట్టిరి గదా! పతివ్రతా స్త్రీలకుఇది ఏవిధంగానూ అవమానకరం కాదని మన శాస్త్రగ్రంధాలు చెప్పుకొంటూన్నవి గదా!

ఇదేరీతిగా ప్రాచీనకాలమున యూదుల్లో పిల్లల్ని కనని విధవలు మరదికి ఉంపుడు గత్తెలుగా వుండి పిల్లల్నికనేవారు. 'డూటర్నమీ' అనే ధర్మగ్రంధంలో 25వ అధ్యాయంచివర భాగంలో స్త్రీలకు వీరు విధించిన నియమాలు చాలా హేయకరంగా వుంటవి. పిల్లల్ని కనేందుకు ఆడవాళ్లతో ఎంత పాడు పనుల్ని చేయించేవారో చెపితే వినుటకు ఎంతో మొరటుగను అసభ్యముగను వుండును. ఇదేవిధంగా ఆఫ్రికాలోకూడ జరుగుతూ వుండెడిది...... హెర్బర్ట్ స్పెన్సర్ —

"Dahoman, l:ke all ohier Semi.barbarians considers a numerous family the highest blessing (అర్థబర్బరులవలె దహోమనులుకూడ ఎక్కువమంది బిడ్డలను కలిగియుండుట పరమ సౌభాగ్యముగ భావించెడి వారు)

ఇదేవిధముగ ఆఫ్రికా యందలి తూర్పు భాగమున It ts no disgrace for an unmarried woman to become the mother of numerous family. Woman's irregularities are easily forgiven if she bears many. children. (పెండ్లికాని ఆడది చాల మంది పిల్లల్ని కనుట తప్పుకాదు. ఆడది, ఎవతెయైనా, ఎన్ని యితర తప్పులుచేసినదైనా సరే ఎక్కువమంది పిల్లల్నికంటే, ఆ తప్పులన్నీ పోతవి.) మరొకచోట వోటియాక్స జాతివారిని

గురించి వ్రాస్తూ, It is honourable for a virgin gial to hava children. She then gets a weal thier husband and her father is paid a higer halym for her (పెళ్ళికానిపిల్ల బిడ్డల్ని కంటే, ఈజాతివారు ఆమెను చాలా గౌరవిస్తారు. అట్లాంటి పెళ్ళికాకుండా పిల్లల్ని కన్న స్త్రీకి ధనవంతుడైన భర్త దొరికే వాడు, అంతేకాదు. అట్లాంటి పుణ్యవతియగు కూతుర్ని కన్నందుకు ఆ పిల్లతండ్రి కూడా చాలా డబ్బు లభించేది.

అని స్పెన్సర్ వ్రాసెను. ఇదేరీతిని బైబిలులోవలె క్రైస్తవుల old Testament లో కూడా 'ఆడది పిల్లల్ని కనకపోవటం మహాపాపం' అని వుంది.

ఆడదానికి గౌరవం రావాలంటే ఏంచెయ్యాలి? అనే విషయం బోధపడేలాగున పైన ఎన్నో వుదాహరణల్ని చూపాము. వీటిని అన్నింటిని జాగ్రత్తగా పరీక్షించి విమర్శించిచూస్తే పురుషులు తమ స్వార్థాన్ని నెరవేర్చుకొనేందుకే యిట్టి గౌరవ విషయాల్ని గ్రంథాల్లో జొప్పించారని తెలియగలదు. కాని ప్రతి స్త్రీ, పురుషులు తమను యింత అగౌరవిస్తున్నారనే విషయాన్ని తెలుసుకొనేందుకే ప్రయత్నించకపోవటం, తెలిసికొన్నప్పటికి తండ్రి, సోదరుడు భర్తలవల్ల లభించు స్వల్పసుఖాలకి లోబడిపోయి వారివల్లకలిగేమోసాన్ని లెక్కించక పోవటం చాలా విచారకరం. కాని స్త్రీజాతి ఏనాటికైన దీనిని తెలిసికొనకపోదని మా విశ్వాసం.

మొట్టమొదట ఏదేశంలోనైనా ఏదన్నా క్రొత్తనియమం, ఆచారం అమలులోకి తేవాలీ అంటే దాన్ని పురుషుల సహాయంతోనే అమల్లోకి తెస్తారు. కాని, ఆ సమయంలో ఈ తెచ్చేనియమాలు, బంధనలను గురించి వాటిని నిర్ణయించే

టప్పుడు తమ పురుషులతో లేక పోగనే లేక భార్యకు ఈ విధంగా అన్యాయం జరుగుట ధర్మమా? అనేవిషయాన్ని ఆలోచించరు. ఎందుకంటే ఆ నియమాన్ని సృష్టించేప్పుడు తామందరూ పురుషజాతివారమనిన్నీ, స్త్రీలంతా తమకు జన్మశత్రువులగు విరుద్ధజాతివారనిన్నీ ఎంచియే చేసెదరు. ఆ పిమ్మట వాటిని శాస్త్రగ్రంథాల్లో జేర్చి తమ స్వార్థాన్ని నెరవేర్చుకొనేదరు, ఆ ఉదాహరణలను చూపుచూ సంఘముపైన తమ అధికారాన్ని చెలాయించెదరు. అన్ని దేశాలలోగల శాస్త్ర గ్రంథాలు చాలా భాగం ఈవిథంగా సృష్టింపబడ్డవే.

ఆ తర్వాత యీ శాస్త్రములందలి ప్రమాణాలు స్వార్థాన్ని, నెరవేర్చుకొనేందుకు ఆచరణలోకి వస్తవి.

యూదులు తమ దేవతలకు తమ బిడ్డల్ని బలిగా యిస్తూ వుండేవారు. దీనిని తప్పుగా తలచెడివారు కారు. వారి ధర్మగ్రంథాల్లో బిడ్డల్ని హత్యచేయుటను ఖండిస్తూ ఎన్నెన్ని గాథలు వున్నాయో, వాటి వంకకూడ చూచెడివారు కారు. ఇదే రీతిని మెక్సికోవాసులు తమ దేవునికి ఒకనికి, తమ కన్యల్ని బలిగా యిచ్చి పుణ్యాన్ని ఆర్జించుటకు ఏమాత్రం సంకోచించేవారు కారు. అనేక దేశాల్లో ధర్మమనే పేరులో నిర్ణీనతై కొడుకుల్ని హత్య చేసిన రాజుల చరిత్రలెన్నో గలవు

మేవాడు రాణా తనకొడుకును శారెఢ్ రాజు తన కూతురును యిదేరీతిగ బలియిచ్చిరి. ప్రాచీన కాలములో ధర్మమనే పేరుతో బిడ్డల్ని బలిగా యివ్వని దేశం ఒకటి కూడా లేదు. కాని, ఇంతమాత్రంచేత తల్లిదండ్రులకు బిడ్డల మీద ప్రేమ లేదని ఎవరన్నా అనగలరా? అనలేరు. కాని ఆ సమయాల్లో వారిలోని ప్రేమ అదృశ్యమౌతుంది. అంతే

గాను తాను చేసెడిపని ఎంత భయంకరంగా వున్నా. ఎంత అధిక పుణ్యకారిగా ఎంచెడివారు, అంతేగాక. అట్లు చే- కాకున్నచో తమ దేవునకు కోపము వచ్చునని భయముచే, ఎట్టి హత్యాకాండనైన చేయుటకు వెనుకాడెడివారు కారు.

అచ్చటచ్చట ఎవరో ఒకరు మాత్రము, యిట్టిహత్యా కాండలు చేయుటకు వెనుదీసెడి వారుండవచ్చును. కాని, చాలామంది యీరీతిని చేసి ధర్మనిర్వహణ మొనర్చినవారే.

...ఒకానొక తండ్రి తనకూతురును యేభై వత్సరాల ముసలివానికిచ్చి పెండ్లి చేయవలసి వచ్చెననుకొనుడు. అట్టి సమయమందు ఎంతటి క్రూరుడైన తండ్రికి కూడ, యిట్టి ముసలివాని కివ్వవలసి వచ్చెనుగదా యని ఏకొంచెమైన దుఃఖము కలుగకపోదు. కాని, వెంటనే తన 'ధర్మపాలన' మనెడి మాట జ్ఞప్తికి వచ్చి, అతనికి ధైర్యమును కలిగించి తప్పు పని చేయుట లేదని చెప్పును. ఈ రీతిని జాత్యహంకార ముచే చేయబడిన ధర్మ చట్టములను ఇష్టములేకుండ కూడ ఎందరో ఆచరించుచున్నారు.

కాని, వీరందరు స్వార్థముతోనే చేయుచున్నారా? అని ప్రశ్నింపవచ్చును. 'అవున'నియే చెప్పవలసి వచ్చును. కాని కొద్దిమార్పు గలదు. ఎటులన, మొట్టమొదట ఈ చట్ట ములను సృష్టించిన వారు తమస్వలాభార్థమై సృష్టించుచూ ఇవి స్త్రీల క్షేమముకొరకనియు, యిందువలన వారికి స్వర్గము లభించుననియు ... మొదలుగాగల యెన్నో వాక్యములను ధర్మగ్రంథములలో జొప్పించిరి. కొంతకాలము గడచిపోయిన పిదప, అప్పటివారు యిదంతయు నిజమని తలచసాగి, అయిష్ట ముతోనే తప్పనిసరిగ, ఏదో పుణ్యమువచ్చుననెడి భ్రాంతిలో పడి ఎంతటి ఘోరకార్యములనైన చేయుటకు సిద్ధపడసాగిరి.

'ధర్మపాలన' మనెడి పేరుతో జరిగిన ఘోరకృత్యములకు లెక్క
లేదు. ఈ ఘోరములను గురించి విమర్శింప బూనినచో
వారిని జాతిద్రోహులుగా నెంచి మతభ్రష్టులను జేయుచుం
డిరి. ఇందువలన ధర్మముయొక్క నిజస్వరూపము సామాన్య
జనులకు గోచరము కాకపోయెను.

యజ్ఞ యాగాదులనెడి పేరుతో జేసెడి పశువధను
బుద్ధదేవుడు ఆపుజేయించెను. మొదటి పర్యాయము అతనిని
ద్వేషించిరి. అతనిని మతద్రోహి యనిరి. వేదబాహ్య మత
మనిరి. నేడు అతడు మన దశావతారములలో ఒకడు. చూచి
తిరా వింత! నేడాతనిని మతద్రోహియని ఎవరైన అనగలరా?

'సహగమనము'ను ఆపుజేయించుటకై కృషి చేసి కృత
కృత్యుడైన రాజారామమోహనుని కూడ పై విధముగానే
దోషిగా ఎంచి వెలివేసిరి. సహగమన నిషేధ చట్టమును రద్దు
చేయించుటకై ఎంతో ధనమును వ్యయపరచి పార్లమెంటుకు
అప్పీలు చేసిరి చివరకు భగ్న ప్రయత్నులై తిరిగి వచ్చిరి.

కాని, నేడో! ఎవరైన, ఎంతటి పరమ ఛాందసుడగు
వైదిక మతావలంబియైన, ఒకనాడు సమస్త భారత వర్షము
మహా పవిత్రముగా తలచిన సహగమనమును తిరిగి ఆచరణ
లోనికి తేగోరునా; కోరడు. ఏల? ఒకనాడు పవిత్రధర్మముగా
ఎంచబడిన ఆనియమమును నేడుఘోర దురాచారముగ తలం
చుటకు గల కారణమేమి?

ఇందుకుగల కారణము ఒకటే. మనవారు కొంతవరకు
ధర్మము యొక్క, ఆచారముయొక్క మర్మమును తెలిసి
కొనిరి. అందువలననే సంఘ సంస్కరణాది పవిత్ర కార్యము
లలో పాల్గొన గలుగుట.

కాని యిప్పటికికూడ మనవారికిధర్మము యొక్క మూల రహస్యము పూర్తిగా బోధపడలేదనియే అనవలసివచ్చును.

లేనిచో వారు చేయబోవు స్త్రీపునసంస్కరణ విషయము లోను శాస్త్ర గ్రంథములను తిరుగవేయుటేల? శాస్త్ర వేత్తలను సలహా యడుగుటేల?

జ్ఞానమనునది ఏకొద్ది పుటలలోనో యిముడునంతటిపరిమితి గలది కాదని మీకు బోధపడక పోవుటయే గదా! యిందుకు కారణము. హృదయమునకు ప్రకాశము నిచ్చునదే జ్ఞానమనియు ఏవోకొన్ని పుస్తకములు చదువుట వ్రాయుటలను నేర్చుట మాత్రము జ్ఞానము కాదనియు తెలిసికొందురుగాక. మన శాస్త్రకారులు ఏవైన విషయములను కంఠస్థ మొనర్చు శక్తియే బుద్ధి యనియు కంఠస్థ మొనర్చుటయే జ్ఞానమనియు తలంచుచున్నారు. ఇది తప్పు.

...మనవారి యీ పుస్తక పాండిత్యము రాను రాను వీరిని జ్ఞాన శూన్యులనుగా చేసినదని చెప్పవచ్చును. స్వర్గీయ మహామహోపాధ్యాయ చంద్రకాంత తర్కాలంకార గారు (శ్రీ గోపాల మల్లిక్ ఫెల్లోషిప్ పొందినవారు) తమ ఉపన్యాసములో నామకరణ ప్రణాళిని గురించి, 'కొందరు పండితులు మేరు తంత్రములో లండనును గురించి కలదు. కావున అది ఆధునిక గ్రంథమని చెప్పెదరు. కాని ఈమాటను చెప్పుటకు పూర్వము వారు మన పురాణాదులలో భవిష్యత్తును గురించిన అనేక విషయములు గలవనియు అందులో యిదొకటి యనియు తలంచవలెనేగాని యీ దృష్టాంత రీత్యా ఆ గ్రంథమును ఆధునిక గ్రంథమని చెప్పుట తప్పు' అని చెప్పిరి. (ఈ వాక్యముగల మేరుతంత్రమందలి శ్లోకము యీ విధముగా గలదు)

శ్లో॥ పూర్వామ్నాయే నవశతః షడశీతిః ప్రకీర్తితా।
ఫిరంగి-భాషయా మంత్రోయేషాం సంసాధనాత్ కలౌ
అధిపా మండలానాంచ సంగ్రామే ష్వపరాజితాః
ఇంరేజా నవషట్ పంచలాండ్రజాశ్చాపి భావినః।

స్వర్గీయ అక్షయ దత్తుగారు శాస్త్రగ్రంథాల్లో క్రొత్త క్రొత్త శ్లోకాలను జొప్పించు మోసగాండ్రనుగురించి తెలియ జేయుటకై తన 'భారత వర్షీయ ఉపాసక సాంప్రదాయము' అనే గ్రంధంలో పై శ్లోకాన్నే ఉదహరించిరి. పై వారిద్దరూ చాలా గొప్ప పండితులే. ఇందులో ఒకరు పూర్వ గ్రంథాల్లోనే పై శ్లోకం వున్నదనిన్నీ, మరొకరు క్రొత్తగా జొప్పించ బడినదనిన్నీ అభిప్రాయపడుతున్నారు. ఇందులో ఒకరు సంస్కృత భాషపైనను తమ ప్రాచీన శాస్త్ర గ్రంథములపైనను తమకుగల మూఢనమ్మకముచేత, హస్తమునుచూచి భవిష్యత్తును చెప్పినరీతిని, రేఖను గీసి లండనును గురించి వ్రాసి యుండవచ్చుననను నమ్మకమువల్లను అన్నిటినీ సత్యముగా తలంచిరి. మరొకరో; వాటిని విమర్శనా దృష్టితో వివేచన చేసి పారసీభాషలోగాని ఆంగ్లేయ భాషలోగాని అట్టి మంత్రములు లేవనుటను తెలిసికొని, తమ మూలశాస్త్ర గ్రంథములో స్వార్ధపరులకు తుచ్ఛులు చేర్చిన శ్లోక విషయము యొక్క నిజస్వరూపమును లోకమునకు వెల్లడి చేసిరి. ఇదియే వీ రిద్దరికిని గల భేదము.

మన పండితులు యిట్టి మూఢ విశ్వాసములకు పాల్పడి తమ భావి ఔన్నత్యమునకు మార్గములను అన్వేషించుకొనక పోవుటయే గాక తమ గృహములను సంఘమును, జాతిని, దేశమును భూలోక నరకముగ చేసికొని తమ జీవితములో సుఖమనేదిది అందరాని పండుగాతలచితమ జన్మను వ్యర్థపరచు

కొనుచున్నారు. ఈవాక్యములు మిూకు కష్టముగ తోచవచ్చు. కానిండు, మనమా శాస్త్రగ్రంథములను విమర్శనా దృష్టితో చదివిన ఏవ్య క్తికూడా మా యీవాదనను కాదనుటకు సాహసించచవలెనియే మానమ్మకము.

జ్ఞానమన నేమో తెలియని యిట్టి మూర్ఖులు, అంధ విశ్వాసుల చేతులలో మన సంఘమును పెట్టి, భవిష్యత్తును పాడు చేసుకొన వలసిన దేనా? అని మా ప్రశ్న దీనిని మే మెన్నడును సహింప జాలము, ఇక, యుగములనుండి సంఘ మును పరిపాలించుచున్న యీ పురోహితులని చెప్పబడు ఘోర రాక్షసులను సంఘము నుండి బహిష్కరించవలెనియా మీా యభిప్రాయమని మీారు అడుగుదురేమో! వద్దు. వారికి కొంత పెత్తనము వుండనిండు. 'దుర్గా పూజ అష్టమికి రెండు ఘడియలు ముందు చేయవలెనా? వెనుకచేయవలెనా? పిల్లిని చంపిన పాపమునకు అయిదు రూపాయలు దానమివ్వవలెనా? పది యివ్వవలెనా? మహాంతుగారు ముండను వుంచుకొనిన స్వర్గమునకు పోవునా? లేక పెండ్లి చేసికొనిన నరకమునకు పోవునా?— మొదలగు సమస్యలను వారినే పరిష్కరింపనిండు. ఇట్టి సమస్యలు సంఘమును ముందుకు గాని వెనుకకు గాని గొనిపోవునవి కావు గదా! కాని సంఘముయొక్క బాగోగు లకు కారణములగు కట్టుబాటులపై వీరికే విధమగు అధికారం వుండరాదనియు, యీ అధికారము సంఘమును ముందుకు గొనిపోవుటకై కృషి చేయుచున్నట్టిన్ని, ప్రజల విశ్వాసమును చూరగొన్నట్టిన్ని స్వ విద్యాసాగర్ లాటి పెద్దలకు వుండ వలెనేగాని, నేటి బ్రాహ్మణులకు వుండరాదనీ మాఆశయము

ఈ ప్రాచీన నియమములను ఉల్లఘించుటకు, నూతన నియమములను సృష్టించుటకు వ్యతిరేక భావమును చూపు,

యి విధానమును శాస్త్ర విరుద్ధముగను, దేశద్రోహాకరము
గను తలచు యీపెద్దలు, ఆశాస్త్ర నియమములు సృష్టింప
బడినప్పుడు సంఘములో ఏప గుణదోషము లుండెడివో ఎన్న
డైన యోచించిరా? ఏప దోషములను పోగొట్టుటకై ఆనియమ
మేర్పరుప బడినదో ఎన్నడైన విచారించిరా? ఈనాటి సంఘ
మందలి దోషములు ఏవో వాటిని తొలగించి సంఘమునకు
పుష్టిచే కూర్చుటకు ఏపనూతన సాంఘిక నియమములు కావ
లెనను విషయమును గురించి ఎన్నడైన తలంచిరా? సాంఘిక
నియమములు కాలాను గుణ్యముగ సంఘ క్షేమము
నకై మార్పు చెందుచుండెనను చారిత్రిక ఆధార
మును ఎన్నడైన అంగీకరించిరా? కనీసము పూర్తిగా చెప్పునది
వినువంతవరకైన వేచియుండిరా? లేదు. వారిది ఒకటే పట్టు
దల. కాబట్టిన కుందేటికి మూడేకాళ్ళను అంధ విశ్వాసము.
తన మతమే మంచిది. తానే పుణ్యజీవి. ఇతరులు మ్లేచ్ఛులు,
ఇతరుల మతము మ్లేచ్ఛమతము తానే మనుష్యుడు. తది
తరులు రాక్షసులు. తాను దేశోపకారి, ఇతరులు దేశద్రో
హులు. తాను శాస్త్రరక్షకుడు. ఇతరులు శాస్త్రవిధ్వంసకులు
ఇదీ వారివాదము.

పోనీ, వీరైనను యీశాస్త్రములలో చెప్పిన ప్రకా
రము; శాస్త్ర నియమముల నన్నిటినీ ఆమోదిస్తున్నారా?
అదీ లేదు. శాస్త్రములు రాక్షసవివాహము, అసుర వివాహ
ములను మన్నించు చున్నవి. క్షేత్రజ సంతానమును ఒప్పు
కొనుచున్నది. వీటి ప్రకారము ఎవరైనా చేసినచో వారు
వొప్పుకొనరు. శాస్త్రసమ్మతమైన ఆచారమేగదా ఎందుకు
ఒప్పుకొనరని మనము ప్రశ్నిస్తే, డొంకతిరుగుడు జవాబు
ఒకటో ఇది దేశాచారము కాదనిన్నీ, మనము చేసినప్పటికి

యితరులు సమ్మతించరనిన్నీ లేకపోయిన దీనిని ఖండించెడి మరొక శ్లోకము, మరొకచోట కలదనిన్నీ, యిట్టి అసందర్భమగు కుంటి జవాబులను చెప్పెదరు. ఎవరైనా గట్టిగా వాదించినచో, వానిని మూర్ఖుడని పిచ్చివాడని, అసందర్భముగా మాట్లాడువాడనీ చెప్పి నిందించెదరు.

ఇందుకు గల కారణమేమిటో యోచించినచో ఈ శాస్త్రపండితులు, తమ కనుకూలమగు నియమములనే జ్ఞప్తి యందుంచుకొని, ఆచరింపజేయుటకై ప్రయత్నించెదరనియు, తమకు వ్యతిరేకముగ నుండు నియమములను వదలివేసి వాటిని గురించి తలచనే తలచరనియు భావించవలసివచ్చును.

ప్రాచీన కాలములో మన దేశమున తదితర దేశములందు, స్త్రీని ఏరీతిని గౌరవించుచుండెడివారో యిదివరకు చదివియున్నాము. 4,5 వేల సంవత్సరములనాటి ఆయిూన్-చట్టమునందలి (పాశ్చాత్యుల) ఒక నియమములో "ఎవరైన స్త్రీ తనభర్తను ఏవగించుకొని అతనిని వదలివేయ దలచుచో ఆమెను వెంటనే నదిలో పడద్రోయవలెను.

(if a wife hates her husband and says, 'Thou art not my husband' into the river they shall throw her)

అనియు మరొకచోట ఎవరైన పురుషుడు తన భార్యనువదలివేయదలచినచో ఆమెకు ఒక అరమీన(ఒకతూకము) బరువు గల వెండిని యిచ్చి యింటినుండి వెళ్ళగొట్ట వచ్చును.

(If a husband says to his wife 'Thou art not my wife, half-a mina Silver he shall weigh out to her and let her go.)

చూచితిరా! స్త్రీలను వీరెంత చులకనగా చూచెడివారో? చూచితిరా, వీరి న్యాయదృష్టి!

కొద్దికాలముకు పూర్వమే యూరోపునందలి స్త్రీలను గురించి "భర్తకు దాస్యంచేయుటకుగాను స్త్రీ తండ్రివల్లఅమ్మబడును ఆమె సోదరునితో సమానముగు హక్కు లుండవు" (She was sold into Slavery to her husband by her father and was treated with a different legal code from her brother) అని వ్రాసిరి. మరికొందరు కూలివాని భార్య జమీందారుని సంపదలాటిది. ఆమె విపరీతముగ కష్టపడవలసి యుండును. (wife of a labourer a chattel of the estate, her life an unceasing drudgery) అని వ్రాసిరి.

మరికొందరు స్త్రీలయొక్క జాలికరమైన జీవితములను చూచి మిల్, కండోర్ సెట్ దొరలవలెవారి దుస్థితినిగురించి దుఃఖించుచూ కొన్ని గ్రంథములను వ్రాసిరి. అదేవిధముగ ప్లేటోకూడ తన 'Republic' లో "ఇంటియందలి మూరు మూలల పడవైచి గృహసంబంధమైన పనులకు మాత్రమే వినియోగించు కొనబడు స్త్రీలు అంతకంటె ఉత్తమమైన మరే పనికి పనికిరారా? స్త్రీలలో సహసాము, తెలివి, కళాప్రావీణ్యత కలవారు లేరా? ఈ యోగ్యత మనకంటె ఏకొద్దిగానో వారిలో తక్కువగా యున్నంత మాత్రాన వారు దేశమునకు నిరుపయోగులేనా?

(This Sex which we keep in obscurity and domestic work—is it not fitted for nobler and more elevated functions? Are there no instances of courage, wisdom, advances in all the arts? May hap these qualities have a certain debility, and are lower than ourselves, but, does it follow that they are, therefore, useless to the country) అని వ్రాసెను. స్త్రీలను గురించి వారి దుఃస్థితిని గురించి యూ

విధముగను, యింతకంటె అధికముగను ఎందరో వ్రాసియుం
డిరి. కాని యిందువలన ఏమైన ప్రయోజనము కలిగినదా అని
యోచించినచో ఏమాత్రమును కానరాదు. ఏల? వీరు వ్రాసిన
దానిలో ఏకొలది ప్రయత్నమైనను చేయక పోవుటయే దీనికి
గల ముఖ్యకారణము.

కాని, పురుషులు స్త్రీలను గౌరవదృష్టితో చూడవలె
నని వ్రాసిన గ్రంథములవల్లగాని పురుషులు ప్రయత్నముచేసి
స్త్రీలకు గౌరవము తేవలెనని చేసిన ప్రయత్నము వల్లగాని
స్త్రీలకు గౌరవము ఆదరణాలు ఎన్నడును రాలేదనిమట్టుకు నేను
ఘట్టిగ చెప్పగలను. అట్టి గౌరవమును ఏనాటికైన తెచ్చుకొన
వలెనని అభిలషించినచో తేవలెనని ప్రయత్నించినచో, స్త్రీలే
తమ ప్రవర్తన వల్ల సంఘములో అట్టి ఉన్నత గౌరవ స్థాన
మును తెచ్చుకొనవలెను. గాని, మఱెవరును తెచ్చినచో పుచ్చు
కొనుట కనువైనట్టిది కాదు. ఇట్టి ప్రయత్నమే ఒకప్పుడు
మిశ్ర దేశమందు ప్రారంభమై రోము వరకు పోయి
అగిపోయినది. ఆ దేమాదిరి ప్రయత్నము మన దేశము నకూడ
ఒకప్పుడు జరిగినది. అట్టి సమయముననే భారత దేశమందలి
స్త్రీలు వేదరచన మొనర్చిరి. అంతేగాదు, తమ ప్రవర్తనవల్ల
పురుషులచే 'దేవీ!' యని సంబోధింపజేసికొని, పురుషుల
హృదయమునుండి వచ్చు ఆపవిత్ర సంబోధనాశబ్దమును విని
ఆనందించినట్టి సుదినములవి.

నేటి కాలపు స్థితిగతులను కొన్నింటిని గురించి యిక
యోచింతము. అవి విధవాపునర్వివాహము కావలెను, వల
దనెడి రోజులు. ఈ కావలెననెడి వారిలో చాలమంది మాటి
మాటికి బెంగాలులలో భర్తలను కోల్పోయి కులభ్రష్టలైన
స్త్రీలను ఉదాహరణముగ చూపుచు, వారు ఆరీతిని భ్రష్టలు

కాకుండుటకై పునర్వివాహము చేయవలెనని వాదించు చుండెడివారు. ఈవాదమును ఖండించువారు కూడ భర్తను కోల్పోయిన స్త్రీ, కులభ్రష్టురాలు కాకుండుటకై, ఆరీతిని భ్రష్టురాలు అగుటకు గల కారణములను కనుగొని, ఆదోష ములను తొలగించిన, పునర్వివాహముతో నిమిత్త ముండ దనియు, అందుకు గాను హరిజట్టును గొరిగించి, ఆభరణము లను దీసివేసి, సాధారణమగు నైనుగుడ్డలను కట్టుకొనుటకిచ్చి దుర్వ్యసనములు లేకుండ నుండుటకై రాత్రింబవళ్ళు ఆమెతో చాకిరి చేయించుకొనుచు, ఏకభుక్తమును నిర్ణయించినచో, యీ చెడుగు తొలగి పోవునని వీరి మతము. చూచితిరా! వీరి లక్ష్యమొక్కటియే కాని మార్గములు భేదములు. కొం దరు 'స్త్రీ తిరిగిచెడు' నన్నటుల ఆమెకు స్వేచ్ఛను కలుగ నివ్వక యింటియందే బంధించవలెననిరి. మరికొందరు గత్యంత రము లేక "విశ్వాసోనైవ కర్తవ్యం" వరకు పోయి ఆగి పోయిరి. వీరికంటె కొంచెము అతివాదులైనవారు "అంకే సీతాఽపి" వరకు పోయిరి. ఈ అతివాదులలో కొంచెము అగ్రగాములుగా నున్నవారు అంతతో తృప్తిపడక "దేవాన జానన్తి" యని మిన్నకుండిరి.

'పూజ్యురాలు' అనెడి ఒక తెరవేసి, అందుకుగాను, వారిని సన్మార్గగాములుగా చేయుటకొరకు విధవా వివాహ ములు జరుపవలెనని ఎవరైన చెప్పుచో, అది ఏమాత్రము సమంజసముకాదు. అట్టి వివాహములను జరుపకుండుటేబాగు.

విధవా స్త్రీలకు పునర్వివాహము చేయనిచో వారు భ్రష్టులగుదురని మీరు ప్రచారము చేయుచున్నారు. బాగు గనే వున్నది. కాని యీ ప్రచారము చేయువారిని, వారు రాత్రింబవళ్ళు తమను భ్రష్టులను జేసికొనుటకయియే మార్గా

న్వేషణ చేయుచున్నారనియా? ఓా అభిప్రాయము, అని ప్రశ్నించెదను. దీనికి మీారేమైన ఆధారమివ్వగలరా? లేనిచో అన్యాయముగ, అధర్మముగ స్త్రీలు తమను భ్రిష్టలనుగ చేసి కొనుటకై ప్రియత్నించుచున్నారని, వారిపై కళంకము నాపాదించుట ఏపాటి ధర్మముగ నున్నది? అని నా ప్రశ్న.

ఒక పాశ్చాత్య దార్శనిక పండితుడు ఒకచోట వ్రాయుచూ బానిసప్రవృత్తి ఏరీతిని అనేకములగు చెడుగులకు (Sum of all villainy) ఆకరమో, అదేరీతిని వేశ్యావృత్తి కూడ పతితురాలగుటకు అన్ని విధముల ఆకరము (Sum of all degradation) అని వ్రాసెను.

కొందరు నా పై ప్రశ్నకు స్త్రీని ఆరీతిని ప్రశ్నించినచో సిగ్గుచేతగాని, తెలివిమాలిన అభిమానమువల్ల కాని, 'కాదు' అని తన మనోభావమునకు విరుద్ధముగు జవాబిచ్చునేగాని నిజమును చెప్ప సంకోచించునని అందురు. కాని నేను దానిని సమ్మతించజాలను.

ఇరవై-ఇరవై అయిదు సంవత్సరములకు పూర్వపుమాట. నా మిత్రుడొకడు భ్రిష్టలైన స్త్రీలయొక్క పట్టికను తయారు చేసెను. అందులో భ్రిష్టురాలైన స్త్రీపేరు, విలాసము, వయస్సు, జతి, కులభ్రిష్ట యగుటకుగల కారణము మొదలగు వివరములు గలవు ఈ రీతిని ఒక పెద్ద గ్రింథమును తయారుచేసెను. అతని దురదృష్టవశాత్తు ఆగ్రంథము అతని యింటికి నిప్పంటుకొనుటవలన తగలబడిపోయెను. అయినను బెంగలేదు! ఈశ్వరుని కృపవలన మంచియే జరిగినది. నా కంఠములోగల వివరములు జ్ఞప్తిగలవు. ఆరీతిని కులభ్రష్టలైన స్త్రీలలో నూటికి డెబ్బైమంది భర్తగల వారున్నారు, భర్తలేని (విధవలు) వారు నూటికి ముప్పది మంది మాత్రి

కుమన్నా గలరు. వీరందరు కులభ్రష్టలగుటకు గల కారణము అతి దారిద్ర్యము. భర్త మొదలగు అత్తవారింటి బంధువుల ఓర్వరాని క్రోడంటికము, ఎల్లప్పుడు చావచితకకొట్టుట అని చెప్పిరి. వీరిలో భర్త వున్నప్పటికి కులభ్రష్టలైన వారందరు నిమ్నజాతులకు చెందినవారున్నూ, భర్త మరణించుటచే కులభ్రష్టలైన వారందరు ఉచ్ఛజాతులకు చెందిన స్త్రీలుగను నుండిరి. వీరిలో నీచజాతి స్త్రీలు, "తిండిలేక పస్తుపడియున్న తమను, రాత్రికి భర్తవచ్చి చావచితకతన్నుచుండుటచే మేము కులభ్రష్టలము అయితిమని చెప్పిరి. ఇక ఉచ్ఛజాతులకు చెందిన విధవలో పుట్టింటిలేక అత్తింటివారి క్రోడంటికమును భరించలేక కులభ్రష్టల మైతిమని చెప్పిరి.

ఉచ్ఛ జాతివారికి భర్త లేనందువలన ఎంతబాధ గలదో, నీచజాతివారికి భర్త వున్నందువలన అంత బాధ అధికము. ఏలనన నీచజాతి స్త్రీలకు భర్త మరణించినచో మరెవరికి భయపడ నక్కర లేదు. ఎచ్చటనైన చాకిరిచేసికొని హాయిగ నిర్విచారముగ ప్రశాంతముగ బ్రతుకవచును. కాని, భర్త వున్నచో అతనివలన ఐశ్వర్యము ననుభవించు భాగ్యములేక పోగా ఆతనిదెబ్బలనుఓర్చుకొని పడివుండవలసి వచ్చును. అందువలన వారికి భర్త జీవించియున్న జీవితముకంటె ఆతడు లేని జీవితమే ఎక్కువ ఆనందకరముగ వుండును.

అదేరీతిని ఉచ్ఛజాతి స్త్రీలకు భర్తగల జీవితము సుఖప్రదమైనది. భర్తలేనిచో యీమెయొక్క సుఖమును గురించి చింతించువారే వుండరు. పోని, ఎచటనైన చాకిరిచేసికొని బ్రతుకుట, పుట్టింటి అత్తింటివారి గౌరవమునకు భంగకరము. ఈమెకు, కడుపునిండ కావలసినది తిని, కోరిన బట్టకట్టుకొను భాగ్యం లేకపోగా, క్రోడంటికముజాస్తి, చేయించుకొను

చాకిరిమెందును. ఈ బాధలను పడజాలక యామె కులభ్రష్ట యగుచున్నదేగాని తన కామమును నెరవేర్చుకొనుటకు మాత్రముకాదు. దీనిని బట్టి కులభ్రష్టలగు స్త్రీలు సంభోగముకొరకు కులమును త్యజించుట లేదని తేలుచున్నది. ఏలనన పై లెక్కలనుబట్టి కులమును వదలిన వారిలో నూటికి డెబ్బదిమంది భర్తలున్నవారేగదా !

పై రీతిని కులభ్రష్టలైన స్త్రీలలో నూటికి డబ్బదిమంది భర్తగలవారే యని తేలుచున్నప్పటికి భర్తల, తదితరులబాధలను సహించజాలక కులత్యాగ మొనర్చుచున్నారని తెలియుచున్నప్పటికి యీవిషయమై, దీని నివారణకై యోచించక సంస్కర్త లందరు భర్తవల్ల సౌఖ్యము పొందు (సంభోగ) భాగ్యము లేసందువల్ల నే విధవలు కులభ్రష్టలగుచున్నారని వారికి గల కఠోరమైన కట్టుబాటులను సడలించినచో యీ ఘోరదురాచారమును రూపుమాపి సంఘ శ్రేయస్సు కలిగించినవార మగుదుమనిన్ని తలచి తమ ఆశయములను ఎండమావులవలె చేసికొనుచున్నారు.

ఏరీతిని చూచనను స్త్రీలు చెడిపోవుటకు పురుషుడే కారణుడగుచున్నాడు. ఇంటియందు తన దారిద్ర్యమువల్ల, భార్యను సుఖపెట్టజాలక అందుకు మారుగా ఆమెను నానా హింసలుపెట్టుచున్నాడు. మరొక రీతినో 'అందలములపై నెక్కించెద'నని భ్రమపెట్టి యిల్లువదలి బయటకు వచ్చులాగునచేసి తనకు వెగటుగలుగు నంతవరకు ఆమెతో సుఖ - భోగముల ననుభవించి వెగటు బుట్టగనే ఆమెను త్యజించి తిరిగి తన యింటికి రాగలుగు చున్నాడు. అతనిని బహిష్కరించు వారే లేరు. అతడిట్టి అవినీతికరమగు పని చేసి నందుకుగా నేవిధముగను భ్రష్టుడు కాగలుగుట లేదు. పైగా అతడు సిగ్గుచే రెండు

మూఁడురోజులు యింటికి వచ్చిన పిదప దాఁగియున్నప్పటికి తోటి వారందరు, అందే మాత్రము తప్పులేదనిన్నీ, అది సాధారణ విషయమేననిన్నీ, భయపడనక్కఱలేదనిన్నీ ధైర్యము చెప్ప, సంఘములో పూర్వపు రీతినే తన స్థానమునుసంపాదించుకొనుచున్నాఁడు. కాని, స్త్రీయే, అటుల తిరిగి వచ్చుటకు వీలులేదు కావున ఏవిధముగ చూచినను స్త్రీకే హానికరము. ఇట్టి అవినీతికరమైనపనులు చేసిన యీ పురుషుఁడే, మరునాటినుంచి, "స్త్రీని గుమ్మము దాటిబయటకు పోనివ్వరాదనిన్నీ, ఆమెను వంటయింటి కుందేలువలె నుంచవలెననిన్నీ సిగ్గులేక శ్రీరంగనీతులతో ఉపన్యాసము లివ్వనారంభించుచున్నాఁడు.

ఇంకొక వింత చూచితిరా ! ఏదో తెలిసియో తెలియకయో, స్త్రీ ఒకసారితప్పు చేసినదనుకొనుడు, ఆమెను తిరిగి ఎన్నడును భర్త స్వీకరింప నొల్లఁడు. ఏల? పరపురుషుని తాకినందువల్ల. కాని ఆస్త్రీయే చివరకు విసిగి వేసారి వేశ్యగామారినచో ఆమె అందరకును అమృతమువంటిదే. స్వర్గతుల్యమే. అప్పుడామెను తాకనివాఁడు వెఱ్ఱి వెధవ !

మన గ్రంథములలో భగవంతునికి ఎన్నివిశేషములు గలవో, అన్ని విశేషములతో వేశ్యలనుకూడ మన గ్రంథకారులు వర్ణించియున్నారు. ఇదంతయు ఎందులకు? తమ (పురుషుల) స్వార్థమునకే కాకున్న మఱి దేనికి? కావున మనము ఈస్వార్థపరత్వము పురుషులలో ఎక్కువగా వున్నదా? స్త్రీలలో ఎక్కువగా వున్నదా? ఎవరు ఎక్కువ స్వార్థపరులు? ఎవరి స్వార్థపరత్వమువల్ల సంఘము అవినీతిపాలగుచున్నదనెడి విషయమును యోచింపవలసి యున్నది.

ఇక స్త్రీ చేసిన తప్పును నూటికి ఒక్కపాలుకూడ

క్షమించుటలేదు. కాని పురుషునో- పూర్తిగా వదలివేయు
చున్నారు. ఏల? పురుషుని బలము వల్లనే కారణము, సంఘ
మనిన 'పురుషుడే' 'స్త్రీ' కాదు. ఈ సంఘము పురుషునకు
సర్వహక్కుల నిచ్చినది. స్త్రీకో ఏహక్కున్నూ లేదు. పురుషు
డెంత దుష్టుడైనను, స్త్రీ అతనిని తృణీకరించరాదు. కాని
పురుషుడో తన యిచ్ఛానుసారముగ ప్రవర్తించవచ్చును.
భర్తయే ఆమెకు దైవము. ఆతనికేమాత్రము కష్టము కలుగ
నివ్వరాదు. అంతేగాదు. ఆతనితో పాటు మరణించితీరవలెను.
కనీసము మరణించిన భర్తయొక్క నామస్మరణ చేయుచు
జీవితవృక్షమును నీరసముగ నొనర్చుకొనవలెను. ఇదియే
నారీత్వముయొక్క అర్థము!

నేటి కొందరు వైజ్ఞానికవేత్తలు, సంతానముయొక్క
చెడుగులకు ఎక్కువభాగము స్త్రీలేకారకులుగ కనిపించుచున్నా
రనియు, పురుషులదోషమేమియు కన్పించుటలేదనియు వాదించు
చున్నారు. కాని, వాదనను చేయుటకు పూర్వము వైద్యలోక
మును సంప్రదించవలెను. వారిని అడిగినచో 'పురుషులు
వేశ్యాగాములగుటచే పొందిన అనేకములగు సుఖ
సంకటములచే కులస్త్రీలు కూడా బాధపడ వలసి వచ్చు
చున్నదనియు కులస్త్రీలు తమ నైతిక జీవితమును ఈరీతిని
భ్రష్టపరచు కొనవలసి వచ్చుటచే, ఎంతోమంది బిడ్డలు
పుట్టుకతోనే తమ తాతతండ్రుల దుష్ప్రవర్తనల వలన వారు
పొందిన వ్యాధులను పొంది, పుట్టుచున్నారనియు, వైద్యులు
చెప్పుచున్నారు. ఇట్టి ఏమియు తెలియని పసిపాపలు తమ
తాతతండ్రుల దుష్ప్రవర్తన ఫలితముగ తమజీవితమునంతను
నరకప్రాయముగ అనుభవించవలసిన దుఃస్థితికి పాల్పడుచున్నారు
కాని యింక ఏమతమై శాస్త్రములుగాని, లోకాచారము

గాని, సంఘముగాని ఏమైన ఖండించుచున్నదా? లేదు. మౌన ముగ ఊరకొని యున్నది. ఇటుల మౌనముగ నుండుటకుగల కారణమేమి? ఇవన్నియు పురుషునికి పట్టము గట్టియుండుటే కాదా? పురుషుడు అనేకములగు ఘోరసంకటములను తగుల్చు కొనినప్పటికి సుఖవ్యాధులచే గుందుచున్నాడని తెలిసియున్న ప్పటికి స్త్రీ నోరుమూసికొని వాటిలో తానుకూడ భాగము పంచుకొన వలసినదే గదా! అటుల కాదనిన చో ఆమెను పతివ్రత కాదని పాపిష్ఠి యనిన్నీ అనవలసినదేగదా?

ఇట్టి ఘోరబాధలనుండి తప్పించుకొనుటకు కనీసము యితర దేశ స్త్రీలకు విడాకులైనగలవు. కాని మన దేశమందో! అదికూడ లేదు. మన దేశము భగవంతుని దేశము. ఇచ్చట జన్మించనివానికి మోక్షము లేదు, భగవంతుడు యిచ్చటనే జన్మించును. ఇచ్చటి స్త్రీలు పుణ్యురాండ్రు. కావున యిచ్చట స్త్రీలు పురుషులెన్ని బాధలు పెట్టినప్పటికి సహించి ఊరకుం దురు. అందుచే, పురుషుడు దేశదేశములందు మార్మోగు నటుల బొబ్బలు పెట్టుచూ, "మా దేశమందలి స్త్రీలతో సమా నమైన సహిష్ణులు ప్రపంచమందెచ్చటను లేరని" ప్రగల్భ ములు చెప్పుకొనుచున్నాడు.

మన దేశ స్త్రీలంతటి కష్టసహిష్ణులు ప్రపంచమందెచ్చ టను లేరనుమాటను కాదను. కాని, ఇది పురుషుడు గొప్పగా చెప్పుకొనదగినరీతిని గలదా? యనినా ప్రశ్న. పైగా ఎచ్చట నైన ఏ స్త్రీయైన విడాకుల నిచ్చినటుల వార్త ప్రకటింపబడినచో, దాని నూతగాగొని మనవారు సంపాదకీయముల విదేశీ సభ్యతా విధానమును ఖండించుచూ వ్రాసెదరు. ఇదేనా మనవారి బడాయి!

ఇట్టి మన సత్వము గలవారి భావ మెట్టిదో. అది

యితరుల దోషములను గోరంతలను కొండంతలుగా జేసి విమ ర్శించినచో మన గౌరవము పెంచ్చునని. అది ఎన్నటికిని సత్యముగాదు. మాటిమాటికి విడాకుల నిచ్చుట విదేశీయ స్త్రీలకు మాత్రము ఆనందకరమా? ఎన్నటికిని కాదు. మనదేశ స్త్రీలవలె గత్యంతరములేక మొదలకంఠ పూరుకొనుటకు బదులు ఆ బాధనుండి తప్పించుకొని సుఖపడ వాంఛించెదరు. ఇందుగల తప్పేమి? విదేశీ స్త్రీలు విడాకు లిచ్చుటకై చూపు కారణముల వంటివి, అంతకంటె హెచ్చైనవి మనదేశమందు లేవా? మీరు విడాకులు ముఖ్యముగా చూచుచున్నారేగాని అందుకుగాను గల కారణములను ప్రధానముగ గమనించుట లేదు. అదే తప్పుదారి.

విదేశములందు మాత్రము పూర్వకాలమునుంచి విడాకులు గలవా? లేవు. ఈ మధ్యయుగమునందే అచ్చట ఆచారముగ నైనది. దీనిని గురించి పాం. కే. పియర్సన్ Ethics of Free Thought లో, విడాకులను గురించిన "చర్చి" మత సంబంధమైన నిరంకుశ కట్టుబాటుల వలన దుర్నీతి ప్రబలసాగినది. స్త్రీ పురుషులలో వ్యభిచారము మితిమీర సాగినది. పురుషు దృష్టిలో స్త్రీ యన చాల తుచ్ఛ వస్తువుగ నుండసాగినది. ఇందువలన స్త్రీలకు గృహ కృత్యములయందు శ్రద్ధతగ్గి, పురుషులను ఆనందపెట్టుటకై ప్రయత్నముచేయుట హెచ్చుకా సాగినది. (Church's irrational rigidity as regards divorce tended to foster disorder and Shame. Texual disorder increased woman became cheaper in the esteam of men and the narrowing of her interest to domestic work the desire to please men proceeded apace)

ఆడసింహము గలదనుకొనుడు. ఋతుకాలము సంభవించి నప్పుడు ఒకే స్త్రీ సింహముతో సంభోగించుటకు రెండు పురుష సింహములు "నేను, నేను, అని పోట్లాడుకొన మొదలిడెనను కొనుడు. అట్టి సమయమందీ స్త్రీ సింహము వీటిలో ఏపురుష సింహము పైనను పక్షపాతము వహించియుండదు. ఆపోరాట ములో ఏదిజయించునో దానివెంటనేపోయి సంభోగ సౌఖ్యము ననుభవించును. ఓడిన లేక, పోరాటములో మరణించిన సింహమువైపు చూడనుకూడ చూడదు.

ఈరీతిని గర్భధారణ యగునంతవరకు ఆపురుషసింహ ముతోనే కాలముగడపి గర్భధారణ కాగానే దానిని వదలి తాను స్వేచ్ఛగా తిరుగును. పిమ్మట తనబిడ్డలను ఆహార మును సంపాదించుకొనుశక్తి వచ్చువంతవరకు కాపాడి, ఆపిమ్మట వాటిని వదలి మరల యథేచ్ఛగ విహరించును, ఒకొక్కప్పుడు తన వీర్యమువల్ల పుట్టిన యీబిడ్డలనే, తండ్రి యగు పురుషసింహము తినివేయుటకూడ జరుగుచుండును. ఇదేరీతిని కోతులు కొండముచ్చులు తమ పుత్రినే తాము చంపి తినుచుందురు.

పై తార్కాణమును బట్టి యోచించవలసిన విషయ మొకటిగలదు. ఈ జంతువులు తమవంశ (బీజ) వృద్ధికై ఎంతటి ఘోరకృత్యమును చేయుటకైన వెనుదీయుట లేదు. చివరకు తాను చచ్చుట లేక ఇతరుని చంపుటవరకుచేసి తనవంశవృద్ధిని గావించుకొనుటకై పాటుబడుచున్నవి. అంత వరకేకాని, భవిష్యమందు తన వంశముయొక్క స్థితి ఏమగు చున్నదో యోచించుట లేదు. కాని యీ పశుప్రవృత్తిని దాటి కొంత ముందునకుపోయి మానవప్రవృత్తిని పరిశీలించి

నచో అచ్చటకూడ యీ దుస్థితి ఏమాత్రము తప్పకగా లేదనియే చెప్పవలసి వచ్చును.

ఈ విషయమును ధృవపరచుటకు ముందు రెండు మూడు ఉదాహరణల నివ్వదలచితిని. క్రిమోన్నతి యనెడి పేరుతో స్త్రీ పురుషుల సర్వతోముఖమైన ప్రేమ స్నేహము లను నిదర్శనముగ జూపు వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసులను సృష్టించిన మధుర ప్రేమలను ఎవ్వరును స్వర్గసుఖముతో సింహయున్నది కాదని అనజాలరు. అంతేగాదు అట్టి స్వర్గ సుఖమును చూరగొన్న జీవులు నీచకులమున జన్మించిరని ఉపేక్షించుట కున్నూ వలనుపడదు. అంతేగాదు. మనము మన నిర్లక్ష్య భావముచే గౌరవభావముతో ఆదరించక పోయి నప్పటికి వారి గొప్పదనమున కేమాత్రమూ లోటురాదు కూడను.

మేము మిమ్ములను కోరునదేమన; మీరు మీపూర్వు లయొక్క చరిత్రలు, వారిప్రేమ, స్త్రీ పురుషుల కలయికలు వాటి పరిణామము, నేటిస్థితి, వీటి నన్నిటిని ఒక్కసారి సింహావలోకనము చేయుడని మావిన్నపము. ఆనాటి పశు వృత్తి ఏరీతిని రాను రాను అద్భుతమైనట్టిన్ని, అనిర్వచనీయమై నట్టిన్ని ప్రేమగనూ, ప్రాతివ్రత్యముగనూ మారినదో యోచించుడు. దానికి వారు తగుదురో తగరో, వారికిచ్చిన గౌరవస్థానము యోగ్యమైనదో కాదో యోచించుడు.

మాకు శారీరకబలము గలదు గాన, మాయింటిలో మేము కండ్లు మూసికొని మాయిష్టము వచ్చినరీతిని మేము శాస్త్ర నియమములను ఏర్పరచెదమని దుర్భ్రమలో మీరె న్నడును పడవద్దు. మీ ప్రతిచట్టము, ప్రతి నియమము సత్య మునకు కట్టుబడి వుండవలెనని తెలిసికొనుడు. అట్టి సత్యముపై

ఆధారపడి యుండని నియమములను నేటి మీ సంఘబలము భుజబలముల వలన సర్వజనాదరణీయముగ చేయ జూచినను అదియెల్లకాలము నిలువదనియు, మీ బలము క్షీణించిన మరునాడే అది తుత్తునియలుగా ఖండించివేయబడుననియు తెలిసికొనుడు. కృత్రిమమైన ఉపాయములను పన్ని వాటి నాధారముగ జేసికొని యుండు ఏ విషయమున్ను పునాదిబలము లేని కట్టడమువలె వెంటనే కూలునని తెలుసికొనుడు. సేనురాజు వల్ల నిమ్నజాతి వారలు బెంగాలీ బ్రాహ్మణులుగా సృజింపబడిరి. వారికి సర్వమాన్య బ్రాహ్మణ జాతికిగల గౌరవము నేడు గలదా? లేదు; ఎన్నడును వుండదు.

నేటివరకు సభ్య జాతులుగా ఎంచబడుచున్నవారు స్త్రీయొక్క మూల్యము నెటుల వివరించిరో యింతవరకు చర్చించితిమి. ఇక నేటివరకు సుసభ్యజాతులుగా ఎంచబడని వారు స్త్రీని ఏవిధమున గౌరవించుచున్నారో తెలిసికొందము.

అమెరికాయందలి చిపివాయన్ అను అనాగరిక జాతులను గురించి 'హెర్బర్ట్ స్పెన్సర్' తమకు ప్రీతిగొలుపు స్త్రీని పొందుటకై పురుషులు తన్నులాడుకొనుచుందురు. (Men wrestle for any woman to whom they were attached)" అని వ్రాసెను. నిజమే. వీరినిగురించి నూరు సంవత్సరములకు పూర్వము హార్ణదొరం తన పుస్తకములో "ఈ జాతి పురుషులు తన స్వంత తల్లితోనైనను క్రీడించుటకు వెనుకాడరనియు, తనకు ప్రీతిగొల్పు లాగుననున్నచో తన స్వంత తల్లినైనను, తన ముసలి తండ్రియొక్క ఆధిపత్యమునుండి బలాత్కారముగ తీసికొని ఆమెను పునర్వివాహము చేసికొందు"రనియు వ్రాసెను. మరొకచోట హెర్బర్ట్ స్పెన్సర్ తన Descriptive Sociology లో

వారిని గురించి "ఈ జాతీయులు తన భార్యను ఏ కారణము వల్లనైన వదలివేయవలసి వచ్చుచో, ఆమెను చావచితక కొట్టి వెళ్ళగొట్టుదురు. విడాకులకుగాను ఆమెకు లభించు ప్రతిఫలమిదియే. (In the Chippewayan tribes divorce consists of neither more nor less than a good drubbing and turning the woman out of doors)" అని వ్రాసెను. ఆస్ట్రేలియా యందలి ఆదిమ నివాసులను గురించి "ఆడదానికై హక్కు సంపాదించుకొనుటకు బల్లెములతో పోట్లాడుచుకొనుచుందురు. (Fight with Spears for possession of a woman)" అని వ్రాసెను. అమెరికాయందలి డగ్రిబ్ జాతులను గురించి "వారు దుప్పుల వలె స్త్రీ కొరకు పోట్లాడుకొందురు. (Fight just like Stages)" అని వ్రాసెను. అమెరికాయందలి మంత్రిజాతులను గురించి "వారు స్త్రీకొరకు ప్రకృతి సిద్ధమైన శత్రువుల వలె పోట్లాడెదరు. (Fight like Natural enemies)" అని వ్రాసెను. డగ్రిబ్ జాతీయులు "భార్యలచేత బరువు మోయు గాడిదలు మొదలగువానివలె చాకిరి చేయించుకొందురు. (use like beasts of burden)" అని రచించెను.

మంత్రిజాతీయులు వారి జీవితములో నలుబది యేబది పర్యాయములైన పెండ్లిచేసుకొందురనియు ఈ అనాగరిక జాతి పురుషులు, పైన పేర్కొనినరీతిని జంతువులవలె స్త్రీ సంగమమునకై పోరాడుకొనుచుందురనియు, తృప్తి కలిగినపిమ్మట స్త్రీని త్యజించుటకూడ పశువులరీతి నేవుండుననియు రచించెను. వీరికి స్త్రీ యనిన ఏమాత్రముకూడ గౌరవము లేదు. అదే రీతిని స్త్రీలుకూడ గౌరవముగలవారుగ ప్రవర్తించెడివారు

కారు. పశుప్రవృత్తిని పోరాటములో గెలుపొందినవానివెంట మొదలకొంచగా స్త్రీలు పోవుచుండెడివారు.

ఈరీతిగా గలచే మన వేదములందు కొన్ని గలవు. ఉద్దాలకుని పుత్రుడగు శ్వేతకేతువు, ఎవరో అపరిచితుడగు బ్రాహ్మణుడు తన తల్లిని అపహరించుకొని పోవుటను చూచి, తన తండ్రిని, "ఈతడు మా అమ్మను ఎక్కడకు తీసికొని పోవుచున్నాడు?" అని ప్రశ్నించెను. ఆనాటి పురుషులు స్త్రీని తన భుజబలమువల్ల వశమునందుంచుకొనగలిగినంత కాలము 'ఆస్తి' వలె వుంచుకొనుట, లేదా తనకు వెగటు తోచిన వెంటనే స్వేచ్ఛగా ఆమెను ఇచ్చవచ్చినరీతిని విహరించుటకు వదలి వేయుటను చేయుచుండెడివారు.

దీనికంటె విచిత్రమైనను గొలుపు మరియొక తార్కాణము గలదు. అది పాలినేషియా, న్యూకాలిడోనియా, ఫిజీ ద్వీపమందలి అనాగరిక జాతులవారి విషయము. వీరి చరిత్రను వ్రాయుచూ, "వీరు తమకు నచ్చిన స్త్రీని పొందుటకై ఎంతకైన తెగించి, చివరకు సాధించి, యింటికి తెచ్చుకొందురు. ఆమెతో యథేచ్ఛగా సుఖములనను భవించి, చివరకు వెగటు తోచినచో, ఆమెను యింటినుండి వెడల గొట్టుటకు మారు, ఆమెను చంపి తినుచుండెడివారు, అని ఎడ్మిరల్ ఫ్రిజీ హాంబోల్డ్, విల్సన్ దొరలు వ్రాసిరి. ఇదికూడ కొంత వరకు నయమే.

దీనికంటె నీచవృత్తిని సూచించు మరొక తార్కాణం గలదు. అది స్త్రీని తమ స్థిరచరాస్తుల వలె గణించుట. Principles of Sociologyలో హెర్బర్ట్ స్పెన్సర్, "స్త్రీలు చాకిరి చేయుటకే పుట్టారు. వారుయిద్దగు పురుషులు మోసినంత బరువును మోయగలరు అని తనకొక చిప్పివియన్ నాయ

క్కు చెప్పినట్లుల హేరన్ వ్రాసినాడు. (A Chipwayan chief said to Hearne, women were made for labour One of them can carry or haul as much as two men can do) అనివ్రాసినాడు. లివింగ్‌స్టన్ వ్రాసిన Interior of South Africa లోని ఒక విషయము ఉదాహరిస్తూ "ఒక అనాగరికుడు నాతో యీరీతిని చెప్పెను," స్త్రీభర్తయొక్క చాకిరిచేయు ఎద్దు. దానినట్లనే నేను కొంటిని. కావున అదిచాకిరి చేయవలెను"

(The woman is her husband's ox, or as a kaffir once said to me she has been bought, he argued and must therefore labour) అని వ్రాసినాడు.

అనాగరికులగు మపూచీజాతివారు కొంతవరకు ఉన్నత స్థితికి వచ్చినట్లుల యీ క్రిందివాక్యములవలన తెలియగలదు.

"మపూచీ జాతికిచెందిన స్త్రీయొక్క భర్త మరణించిన యెడల ఆమె సవతులలో ఎవరికైనాగాని యీడుకువచ్చిన పుత్రుడు లేనిచో స్వతంత్రురాలగును. తగిన వయస్సు వచ్చిన పుత్రులున్నచో ఆ స్త్రీ ఆస్తిపాస్తులతో పాటు వారికేగాక వారు పంచుకొని అనుభవింపవచ్చును (A Mapuchi widow by the death of her husbond, becomes her own mistress, unless he may left grown up sons by another wife, in which case she becomes their Common concubine being regarded as a chattel naturally belonging to the heirs of the estate పరిపంచములో ఎక్కువ భాగము లో స్త్రీకిగల స్థానమిదియే.

మన శాస్త్రములలో వలె తన కుమారునిచ్చుటకుగాను పుచ్చుకొన్న డబ్బును తిరిగిచ్చినను న్యాయాలున్నచో భర్తను కోల్పోయిన కోడలిపై అత్తమామలకు పూర్తి ఆధిపత్యమును

కలిగి యున్నకీతిని క్రైస్తవుల Old Testament లో కూడ అదేమాదిరి ఉదాహరణలు అనేకములు గలవు. వేరా పాజ్ Vera Paz లందలి ఆదిమ నివాసులను గురించి యీ గ్రంథములో "మరణించిన పురుషునియొక్క సోదరుడు ఆ మృత వ్యక్తియొక్క భార్యను తన భార్యగా చేకొనవచ్చును అతడు వివాహితుడై యున్నప్పటికి కూడ ఇటుల చేయుట దోషము కాదు ఏ కారణమువల్లనైన అతడు ఆమెను భార్యగా చేకొనకున్నచో తదితర బంధువులకు యీ హక్కు కాగలదు (The brothers of the deceased at once take her (the widow) as his wife even is he was married, and if he did not another relation had a right to her) "దీనియొక్క భావము ఆమెపై తమకుగల ఆధిపత్యమును జారవిడువకుండుటయే, నాటికి తొంభైతో మ్మదిజాతులు స్త్రీని యీ రీతినే ఉపయోగించుకొనుచుండెడివారు.

History of women's Suffrage, లో అమెరికా ఖండములో 1850 సంవత్సరమువరకు స్త్రీ యొక్క స్థానము ఏరీతిని వుండెడిదో చక్కగా వర్ణింపబడియున్నది. దానిలో స్త్రీ వివాహమునకు పూర్వమే తనకుగల ఆస్తినంతను భర్తకు వ్రాసియివ్వవలెను. అప్పటికికూడ —"ఆమెకు వ్యక్తిత్వము లేదు." "ఆమె నాగరికురాలుగ ఎంచబడజాలదు" "ఇంటి నౌకరుకంటె కొద్ది ఆధిక్యము కలిగియున్నది." ఆంగ్లేయ సార్వజనిక చట్టరీత్యా భర్తయే ఆమెకు యజమాని, ప్రభువు. "భర్త ఆమెను కొరడాతో శిక్షించవచ్చు." "మసాచ్యుసెట్స్ రాజ్యపు సార్వజనిక చట్టరీత్యా. భార్యాభర్తలు ఒకే వ్యక్తిగా ఎంచబడెదరు. ఆవ్యక్తి పురుషుడు మాత్రమే" "స్త్రీకి వ్యక్తిగతంగా ఏమియు లేదు. తన ఆత్మను 'నాది' అని చెప్పుకొనుటకూడ కష్టతరమే."

('She was not a person, 'Not recognised as a citizen,' 'Was little better than a domestic servent, 'By the English Common Law her husband was her lord and master, 'He could Punish her with a stick, 'The Common Law of the Stete of Massachusets held-man and wife to be one Person, but that person was the husband., 'She had no personal rights, and could hardly call her soul her own." అని గలదు. నేడు అమెరికా ఖండమందలి స్త్రీ స్వాతంత్ర్యమునుగురించి గొప్పగా చెప్పుకొని గప్పాలు కొట్టుచుండువారు, ఒక శతాబ్దికి పూర్వపు స్థితిని గమనించితిరా!

స్త్రీజాతిని యింత హీనముగా చూడసాగుట ఎప్పటి నుంచి ప్రారంభ మైనదో నిశ్చితముగ తెలిసికొనుటకు వలయు ఆధారములు యింతవరకు మనకు లభించలేదు, మానవులు పశువులవలె సంచరించు చున్నప్పటినుండియా? లేక మానవులుగా లెక్కింపబడిన పిమ్మటినుండి స్త్రీని యిటుల హీనముగా భావించు చుండిరో తెలిసికొనుట కష్టమే ఏలనన నాగరిక జాతి కానిండు అనాగరికజాతి కానిండు అన్ని జాతులందును స్త్రీ - పురుష సంబంధము అతి రహస్యముగ నుండి, చూచినంత మాత్రముననే తెలిసి కొనుటకు అనువు గాకుండ నుండెడిది. ఈ రహస్యమును మొట్టమొదట లోకమునకు వెల్లడిచేసినవాడు లేటూర్ దొర ఈతని వ్రాతలను ప్రథమమందు ఎవరూ విశ్వసింప లేదు. కాని క్రమ క్రమముగా అందలి సత్యమును గుర్తింపగలిగిన పిమ్మట విశ్వసింపసాగిరి. అతడు తన గ్రంథములో "అరణ్యకులు తమ భార్యలను చాల క్రూరముగ హింసించుచుందురు, అది వర్ణనాతీతము

(Extreme and un mitigated oppression constantly subjected to unimaginable creuelty and violence by the Savage) అని వ్రాసెను. ఇందు సంశయించ వలసిన ఆవశ్యకతలేదు. కనీసము వ్రాసినట మూడవ పాళ్లైన సత్యమై యుండవచ్చునని ఒప్పుకోనక తప్పదు.

'Head – Hunters' లో Haddon దొర యిందుకు పూర్తిగా విరుద్ధముగా "స్త్రీలు ఏకీతిని నీచముగగాని దురుపయోగపరుపబడుటగాని లేదు (By no means down trodden or illused) అని వ్రాసెను. ఈమాటను కూడ త్రోసివుచ్చుటకు వీలు లేదు. ఇందుకుకూడ అనేక ఉదాహరణలు గలవు భారత ఖండమందలి ఖాసియాజాతి స్త్రీలు తమకు కోపమువచ్చినప్పుడు, భర్తలను యింటినుండి వెళ్ళగొట్టుచుండెడివారు. నికారాగువా, టాహినీజాతుల స్త్రీలు తమకు కోపము వచ్చినచో, తమభర్తను యింటినుండి వెళ్ళగొట్టి మరొకరిని పెండ్లాడు చుండెడివారు.

అంతేగాదు. ఆపచ్ జాతి స్త్రీలు తమ భర్తలు యుద్ధరంగమునుండి పరాజితులై వచ్చినచో యింట ప్రవేశింపనిచ్చెడివారు గారు. డాయేక్ జాతి యువకులు, ఓమేగ జాతి వేటగాండ్రు యుద్ధములో వీరత్వమునుజూపి విజయవంతులై వచ్చు నంతవరకు పెండ్లి చేసికొనెడివారు గారు. నరమాంసమును తిని జీవించు కారిబ్ జాతీయులు పురుషులను మాత్రమే చంపి తినెడివారు. స్త్రీల మాంసమును తినెడివారు గాదు. అరబ్బు దేశమందలి షేక్ జాతి పురుషులు స్త్రీలయెదుట చురుకైన కొరడా దెబ్బలను నవ్వుచూ సహించగల్గిననే వివాహము చేసికొనుటకు అర్హులుగా ఎంచబడు చుండెడివారు ఇవిగాక యింకెన్నో స్త్రీల ఆధిక్యతను జూపు ఆధారములు

గలవు. సుమత్రాద్వీపమందలి బాతా ప్రాంతమునను, ఆఫ్రికా యందలి సువర్ణ ఉపకూలమునందుగు అబిసీయులలోను, అమెరికాఖండపు పెరూరాష్ట్రమునగల అనాగరిక జాతుల వారియందును, యింకెందరో ఆదిమ నివాసులందును, మన దేశమందలి తోడాజాతివారి యందును ఆస్తియొక్క హక్కు స్త్రీదేగాని, పురుషులది కాదనెడి ఉదాహరణములు కాన నగును.

స్త్రీలను గురించి, వారి హక్కులను గురించి, వారు పురుషుల కంటె ఎక్కువ హక్కులను కలిగియున్నారనెడి ఎన్నో ఉదాహరణములున్నప్పటికి, పురుషులు స్త్రీలను ఎల్లప్పుడు పీడించుచున్నారనియే చెప్పవలెను. పూర్వకాలమందు ఒకే స్త్రీని ఒకరి తరువాత ఒకరుగా ఒక్కొక్కప్పుడు నల్గురైదుగురు పురుషుల వరకు పంచుకొని అనుభవించుటవలన ఆమెకుగల సంతానము ఎవరికి పుట్టినవారో తెలిసికొనుటకు వీలగుచుండెడిదిగాదు. అంతేగాదు, భర్త మరణించిన పిమ్మట భర్తకుగల ఆస్తి అతని బిడ్డలకు ప్రాప్తించుచుండెడిది గాదు. అతని సోదరియొక్క బిడ్డలకు లభించుచుండెడిది. అందువల్ల విధవలు తమ జీవికను నడుపుకొనుటకై మరొక పురుషుని తప్పనిసరిగ పెండ్లాడ వలసి వచ్చుచుండెడిది. ఇట్టిదురాచారమును చూచియే టైలర్ దొర సువర్ణఉపకూల మందలిహబ్సీయజాతి స్త్రీలను గురించి వర్ణించుచూ "స్త్రీల స్థితి పైకి చాల ఉన్నతమైనదిగా (Officially Superior) వున్నప్పటికి ఆచరణలో చాల నీచముగా (Practically Very inferior) వున్నదనిన్నీ యించుమించు అన్నిజాతులందును యీరీతిగనే వున్నటుల కాన్పించుచున్నదనిన్నీ" వ్రాసెను.

క్రాలే (Crawley) దొర (My sick Rose) అనే గ్రంథంలో స్త్రీలయొక్క ఔన్నత్యమును గురించి వర్ణించు చూ పాపువర జాతి స్త్రీలను ఉదాహరించెను. అందుమూచు టకు వీరి (స్త్రీల) స్థితి చాల నీచముగ నున్నప్పటికి ఒకవిష యమును బట్టి వీరుచాల ఉన్నత స్థితియందున్నారనియే చెప్ప వలెను. వివాహ విషయములలో సర్వహక్కులు స్త్రీకేగలవు. ఈజాతికి చెందిన స్త్రీలు తమ యిచ్ఛానుసారము తమకు నచ్చిన పురుషుని వివాహమాడవచ్చును. ఇందు విషయములో పురుషుల కే మాత్రము స్వాతంత్ర్యము లేదు. కాబట్టి స్త్రీలు చాల గౌరవవంతమైన స్థితియందున్నారని తప్పక చెప్పవలసి వచ్చును" అని వ్రాసెను. భర్తను నిర్ణయించుకొను హక్కుమాత్రము కలిగియుండి అంతకుమించిన మరే స్వాతం త్ర్యమును కలిగియుండని, వీరి యీ గౌరవస్థానము నిజ ముగ యోచించినచో గౌరవస్థాన మనదగినది కాదనియే మా అభిప్రాయము. పెండ్లాడిన పిమ్మట ఆతడు పెట్టు అన్ని విధములగు హింసలను ఆమె సహించియే యుండవలెను గదా! నిజమునకు యిందేమైన సుఖముగాని, ఆనందముగాని స్వాతంత్ర్యముగాని గలదా? లేదు లేదు. ముమ్మాటికిని లేదు.

రెవరెండ్ నూటర్ ఆఫ్రికాయందలి కాంగో, ఉగాండా ప్రాంతములందలి స్త్రీలకు గొప్ప మర్యాదలు గల వని వ్రాసెను. ఈ ప్రాంతీయులను గురించి వ్రాయుచూ Captain Speke దొర తన Discovery of the race of the Nile అనే గ్రంథము లో కాంగో ఉగాండా రాష్ట్రము లందలి వాహుమా జాతీయులు స్త్రీలను ఏ కారణము లేకుండగనే ఒక్కొక్కప్పుడు చంపివేయుచుందురని వ్రాయుచూ అట్టి ఘట్టములలో తీయబడిన వివిధములగు చిత్రపటములనుకూడా

ఆగ్రింథములలో వ్రాయించెను. అంతేగాదు— స్త్రీల రెండు చేతులకు తాళ్ళనుకట్టి నేలపై పడవేసి పురుషులు ఈడ్చుకొని పోవునప్పుడు వారు (స్త్రీలు) పెద్ద పెట్టున ఏడ్చుచుందురు. వారి యీ ఏడ్పును వినుటవల్ల పిశాచములకైన జాలికలుగును గాని, ఆ పురుషులకు స్త్రీలన పిల్లలు మట్టి (ఆట) బొమ్మల మీద వుండునంత గౌరవముకూడా వుండదు. ఇంకొక ఘట్ట మును గురించి వర్ణించుచూ మరణించిన తండ్రికి గల కన్యల నందరిని ఆతని పుత్రుడు వివాహము చేసికొని, పెండ్లాడిన తరువాత ఏడవనాడే తనకు సాయగురితిని వినయము చూప లేదనెడి నేరముపై వారిలో ముగ్గురిని బ్రతికి యుండగనే చితిపై నెక్కించి చంపివేసెను అని వ్రాసెను.

అనేకమంది భూభ్రమణము చేసివచ్చినవారు అనాగ రక జాతీయులలో చాలమంది స్త్రీ- పురుషులు ప్రేమించు కొనవలెనను విషయమునే ఎరుగని వ్రాసిరి. మాంటేరో ద్వార, "నీగ్రోలు ప్రేమ, అనురాగము, ఈర్ష్య అను పద ములనే ఎరుగరు. వారి భాషలో ప్రేమ, అనురాగము లను సూచించు శబ్దములే లేవు (The Negro knows not love affection or jealousy they have no words or expressions in their language indicative of affection or love) అని వ్రాసెను. సర్ జాన్ లబక్ ద్వార యిదే దేశ మునకు చెందిన హాటేన్‌టట్ జాతీయులను గురించి "ప్రేమ అనునది లేనేలేదా, అని తోచురీతిని వీరు ఒకరిపై నొకరు మమకారము లేనంత ఉదాసీనులుగ వుందురు (Are so cold and indifferent to one another that you would think there was no such things as love between them) "అని వ్రాసెను. శాఫరులను గురించి" పెండ్లిలో

ప్రేమ భావమే వుండదు (No feeling of love in mar riage) అనిన్నీ జారిబ్ జాతీయులను గురించి'' భార్యాభర్త లందు అనురాగమను ప్రసంగమే వుండదు (affection between man and wife is out of the question) అనిన్నీ. "భార్యకు పతిప్రేమ, పతిసేవ యనునవే తెలియ" వనిన్నీ వ్రాసెను. పురుషుల యొక్క ఒత్తిడివల్ల మాత్రమే డాహుమర్, మాలేగాసీ, ఫిజియనులు, ఖీసా, చేమయానా జాతివారిలో పతివ్రతలు కనిపించుచున్నారు. హోమిమా, ఫిజీ ద్వీపము లందలి స్త్రీలు పతి మరణించగనే ఆత్మహత్య చేసి కొందురు. అమెరికా యందలి మండార్ జాతి స్త్రీలు తమ మరణించిన భర్తయొక్క కపాలమును మాలవలె ధరించెడి వారు. రాత్రులందు యీకపాలమును మెడనుండితీసి, ప్రక్క పై పడుకొనబెట్టెడివారు. దానిని స్నానము చేయించుట, ఆహారమును నైవేద్యముగా పెట్టుట, చలిగా వున్నప్పుడు దుప్పటి కప్పుట, పాటలు పాడి వినిపించుటకూడ చేయుదురు. పురుషులు స్త్రీలను ఎన్నెన్ని హింసల పాల్జేసి నప్పటికిన్నీ స్త్రీలు వారిని ప్రేమించి గౌరవించుచుండెడివారు. వారికి అనేక విధముల పరిచర్య చేయుచుండెడివారు. ఇంత విరుద్ధముగ నుండుట ఎచ్చటనైన సంభవమాయని మీారడుగ వచ్చును. సంభవమేనని మాజవాబు. ఇంత బాధ పెట్టు చున్నప్పటికి, అనాలోచితముగ ప్రేమించువారు ఎవరైన వుందురాయనిన, అట్టివారు స్త్రీ లేయని మాజవాబు. స్త్రీలో గల యీా పవిత్ర ప్రేమను పురుషుడు నేటికి కూడ అంగీక రించుట లేదు. అంగీకరించ ప్రయత్నించుట లేదు.

మే మింతవరకు స్త్రీని పురుషులు ఏవిధమున అవమాన పరుచుచుండిరో సప్రమాణముగ ఉదాహరణముల నిచ్చి

యున్నాము. ఇందలి మా తాత్పర్యము స్త్రీని తగురీతిని పురుషులు గౌరవించుచుండుట లేదని లోకమునకు వెల్లడి చేయుటయే. అనేకమంది పురుషులు తాము, తగురీతిని గౌరవించుచున్నామని వాదించు చున్నారు. ఈవాదన యెంత వరకు సత్యమో తెలిసికొనవలెనన్న స్త్రీ గౌరవమనిన ఏమో విచారించవలసి యున్నది.

ప్రప్రథమమున స్త్రీ పురుషుని సంబంధమును గురించి యోచించవలసి యున్నది. పురుషులు స్త్రీతో ముఖ్యమైన నాల్గు బాంధవ్యములను కలిగియున్నారు. అవి-భార్య, సోదరి, కన్య, మాత, వీటిని గురించి వరుసగా యోచింతము. John F. M. Lennan ద్వార అనేక దేశములకు సంబంధించిన ఉదాహరణల నిచ్చుచూ తన Primitive Marriage అనే గ్రంథంలో, ఆదికాలమందు మానవులు పశువుల రీతిని విహారించు కాలములో ఏవిధముగ భార్యలను సంపాదించుకొనెడివారో వివరించెను. నాటి పురుషులలో బలవంతులు బలహీనుని భార్యను బలాత్కారముగ తీసికొనిపోయి, తన కోరిక తీరునంతవరకు, తనకు ఆమెపై వెగటు పుట్టునంతవరకు ఆమెతో క్రీడించి వెగటు పుట్టగనే ఆమెను వదలి పెట్టుచుండెడి వారనిన్ని, స్త్రీ వాంఛను నెరవేర్చుకొను విషయమై, వారెట్టి అసాధారణకార్యములను చేయుటకకూడ వెనుకాడెడి వారు కారనియు వ్రాసెను. దీనిని వర్ణించుచూ ఒక చోట, అతడు— "ఆదికాలమందలివారు వివాహ విషయములో ఏవిధమగు బంధుత్వమును పాటించెడివారు కారు. (Men must originally have been free of any prejudice against marriage between relations) అని వ్రాసెను.

ఇట్టి వరుసవావులు లేకుండగనే స్త్రీతో క్రీడించుట అసభ్యజాతులందేగాదు; సభ్యజాతులందుకూడ వంశాను క్రమ మర్యాదాదూపమున ఒప్పుగనే ఎంచబడు చుండెడిది. ఇట్టి ఉదాహరణ లెన్నేనిగలవు.

ఇంతకు పూర్వమే అనాగరకులగు ఛిపివేఁ జాతివారు తల్లిని పెండ్లాడెడి వారనియు, కొంతవరకు సభ్యజాతిగా ఎంచ బడు ఆఫ్రికాయందలి Gaboon ప్రాంతపు రాణులు తమ భర్త మరణించినప్పుడు తన రాజ్యము పోవునేమోయని శంక గలగగనే తన పెద్దకుమారుని పెండ్లాడుచుండెడి దనియు, పేరూదేశపు సభ్యజాతికి చెందిన రొక్కా ఇంకా వంశీయులు తమరాజ్య సంరక్షణార్థమై రెండవ కుమారునికి తన కడసారి కూతునిచ్చి వివాహమొనర్చి సింహాసనాసీను నొనర్చెడి వార్త నియు తెలియవచ్చుచున్నది. వశిష్ఠఋషి తన సోదరియగు అరుంధతిని పెండ్లాడెను. లంకాద్వీపమందలి అనాగరిక బేద్ధా జాతీయులు తమ చెల్లెలిని పెండ్లాడుట గౌరవనీయముగ తలచు చుండెడివారు. ఇట్టి పెండ్లిని చాల గౌరవప్రదముగ ఎంచు చుండెడివారు, సవతి చెల్లెలిని, సోదరుని భార్యను పెండ్లాడు ఆచారము ప్రతి దేశమందును గాన్పించుచున్నది. అంతే గాదు అనేకులు ఇతరుల భార్యలను కొల్లగొనినచ్చి తమ భార్యలుగా చేసికొనుటను గౌరవప్రదముగ తలచుచుండెడి వారు.

పై ఉదాహరణలు ఆదేశములలోమాత్రమేగలవుగాని, మరెచ్చటను కాదందురేమో? అది భ్రమ. కొద్ది హెచ్చు తగ్గులలో ప్రపంచమందంతటను పైరీతిని జరుగుచుండెడిది. కాలవశమున కొన్ని దేశములలో, నేటివరకును కొన్ని జాతు లలో ఆచరణలో గలదు. మరికొన్ని జాతులలో ఆచరణలో

లేదు, ఇంతియే భేదము. నేను వదిన (అన్నభార్య) గారి నీడను కూడ తాకుట మహాపాపముగ ఎంచబడు యీ దేశమున అయిదుగురు పాండవులు ఒకేభార్యతో కాపురము చేయుట పాపముగ ఎంచబడ లేదు. అసభ్య జాతులలోవలె స్త్రీని బలాత్కరించి తెచ్చి పెండ్లి చేసికొనుట (marriage by capture) గౌరవ ప్రదముగ ఒకనాడు మన దేశములో భావింపబడు చుండెననుటకు మన ఇతిహాసములనుండి వేల కొలది ఉదాహరణలను చూపవచ్చును.

ఆదికాలమందలి స్త్రీలస్థితిని వర్ణించుచూ ఆనాటి పురుషులు స్త్రీ సౌఖ్యముకొరకై ఎంత లేసి కార్యములు చేయుటకును వెనుకాడెడివారు కాదనియు, అనుభవించి తృప్తినొందిన పిమ్మట గడ్డిపోచకంటె నీచముగ తృణీకరించి విసర్జించెడి వారనియు, తెలియజేయుటకొరకే యిచ్చట పేర్కొంటిని. 1870 వరకు అబిసీనియా దేశములో, ఎవరికైన ఉరిశిక్ష విధింపబడినచో అందుకు బదులు తన పెండ్లికాని కూతురు లేక భార్యను ప్రభువునకు కానుకగ సమర్పించినచో, ఆశిక్ష రద్దు అగుచుండెడిదనియు 'అట్టి కానుకను మూడు రోజులు అనుభవించి కోరిన వారికి ఉచితముగ ప్రభువులు ఇచ్చివేయుచుండెడివారనియు ఇట్టి ఒక ఘట్టమును వర్ణించుచూ captain Speke దొర యీరీతిని వ్రాసెను "దీనితరువాత రాజు రాణులు చెట్లచుట్టూ ఆటలాడుకొనుచు తిరుగుచూ ఫలములను కోయుచుండిరి. దురదృష్టవశమున రాజు భార్యలందరిలోన మిక్కిలి అందగత్తె యగు ఒక యువతి ఒక ఫలమును కోసి, రాజు తనపై ఎక్కువ ప్రేమగల వాడగుననెడి భ్రమతో, ఆఫలమును రాజున కివ్వబోయెను. అందుపై రాజు దెబ్బతిన్న పులివలె క్రోధోన్మత్తుడై ఆమెకింత

గర్వమాయని తలచి నౌకరులతో బంధించి తీసికొనివెళ్ళి ఉరి తీయవలసినదిగ ఆజ్ఞాపించెను. (Next the whole party (King & Queens) took a walk winding through the trees and packing the fruits: enjoying themselves amazingly, till, by some unlucky chance one of the Royal wives, a most charming creature and truly one of the best of the lot, plucked a fruit and offered it to the king thinking doubtless to please him greatly, but he like a mad man flew into a towering passion, said it was the first a woman ever had the impudence to offer him anything and ordered the pages to seize, bind and lead her off to execution) దీనిపైన Speke దొర - నా ఆంగ్లేయ రక్తముకు యీ ఘోరకృత్యాన్ని చూచి సహించుట చాల కష్టమైపోయెను. ఏరీతినో కష్టించి ఆమె ప్రాణములను కాపాడగలిగితిని (It was too much for my English blood to stand and of course I ran imminent risk of losing my own in trying to thwart the capricious tyrant but I saved the woman's life) అని వ్రాసెను.

పురుషుల స్వార్థపరత్వమువల్ల స్త్రీలు ఎంత అధోగతి నొందిరో యింతవరకు చర్చించుచూ వచ్చితిమి. పురుషుల యీ స్వార్థపరత్వము స్త్రీజాతికిమాత్రమే ద్రోహము చేయుటతో ఆగిపోలేదు. వీరి యీ స్వార్థపరత్వము దేశ దౌర్భాగ్యానికికూడ ప్రబల కారణమైనదని నిస్సంశయముగ ఋజువు చేయుటకు ఎన్నో ఉదాహరణములను జూపగలము. కాని వాటినన్నిటి నిచ్చుట పేర్కొని గ్రంథమును పెంచుట కిచ్చట తావు లేనందుకు విచారించుచున్నాము.

Captain Speke దొర ఆఫ్రికాఖండము యింతటి దుఃస్థితిలో వుండుటకు గల కారణము పురుషుల స్వార్థపరత్వమేనని అనుభవముపై వ్రాసియున్నాడు. ఒక కులపెద్ద చనిపోయినచో ఆతని ఆస్తికి నేను వారసుడను-నేను వారసుడనని దెబ్బలాడుకొని, చివరకు ప్రాణములనుకూడ ఆ ఆస్తిని తాను పొందుటకై పణముగ నొడ్డుట కచ్చటి పురుషులు వెనుదీయరని వ్రాసెను.

Speke దొర మరొకచోట వ్రాయుచూ, ఆతనికి ఒకపర్యాయము మనుష్యులను చంపి తిను ఒకడు కలసెనట. ఆతనిని యీతడు, "సోదరా! మీ కందరకు పూర్తిగా సరిపోవునంత మాంసము ప్రతిదినము ఎటులదొరకును? మీలో మీరే ఒకరినొకరు చంపికొని తిందురా?" అని ప్రశ్నించెను. అందుపై నాతడు "దొరా! మేమెప్పుడును అటుల చేయము. చుట్టు ప్రక్కల గ్రామములకువెళ్ళి కొని తెచ్చుకొందుము" అని జవాబు చెప్పెను. అందుపై తిరిగి స్పీక్ దొర "అనగా?" అని ప్రశ్నించ, అందుకు జవాబుగా నాతడు "తండ్రులు లేని పిల్లలకు ఆహారపానీయాదుల నిచ్చువారుండరు. అందువల్ల వారు జబ్బుపడెదరు. అట్టిస్థితిలో ఆ పిల్లల తల్లులు తమ ఆహారార్థమై ఒక మేకపిల్ల నిచ్చినంతనే తమ బిడ్డలను అందుకు ప్రతిఫలముగ నిచ్చివేయుచుందురు. అట్టి పిల్లలను యీరీతిని కొని తెచ్చుకొని, చంపి తినుచుందుము. అని అతడు జవాబిచ్చెనట. నాగరక దేశములలో పురుషుడు ప్రథమభార్య మరణించినప్పుడు రెండవవివాహము చేసికొనుటయు, ఆ రెండవభార్య తన సవతి బిడ్డలను నిర్దాక్షిణ్యముగ బాధించుచుండుటయు మనము చూచుచుంటిమిగదా! అదేరీతిని యీ అనాగరక దేశములందలి తల్లులు తనపూర్వ

భర్తకు పుట్టిన బిడ్డలపై దయలేనివారై హైరీతిని అమ్మివేయు చుండెదరని తెలియుచున్నది.

అండమాను దీవులందలి అనాగరక జాతీయులలో ఒక దురాచారముకలదు. అదేమన, బిడ్డకు దంతములు వచ్చునంత వరకు భార్యాభర్తలు కలసి కాపురము చేతురు. దంతములు రా నారంభించగనే వారు ఒకరికొకరు వదలివేసి, స్త్రీ మరొక పురుషుని, పురుషుడు మరొక స్త్రీని పెండ్లాడును. దంతములు రానారంభించిన యీ బిడ్డలను, తల్లులు ఏ జలాశయతీరమునో వదలి పోవుచుందురు. వీరిని గురించి వ్రాయుచూ francis Day గారు అండమాను దీవులలో ఎంత వెదకిచూచినను ముగ్గురు బిడ్డలైన జీవించియున్న స్త్రీ ఒక్కతెయు కాన్పించ లేదనివ్రాసెను.

అమెరికాయందలి కుచిల్ జాతి తల్లులు తమ బిడ్డలు జబ్బుపడుటతడవుగ వారిని (పిల్లలను) తీసికొనిపోయి అడవిలో పారవైచి వచ్చెదరు. హెర్బర్ట్ స్పెన్సర్ దొర SavageLife and scenes in Australia and Newzeelan (by G.F Angas) అనే గ్రంధంలోగల విషయమును ఉల్లేఖించుచూ అంగస్‌దొర ఆస్ట్రేలియాయందలి అనాగరక జాతివారు మొసలినిగాని మరేదైన జలజంతువులనుగాని పట్టుకొనుటకై జీవించియున్న తమ బిడ్డలను వెదురుగడ మొనకు ఎఱగా కట్టి వదలుచుండెడివారని వ్రాసిన విషయమును చదివినప్పుడు నాకు నమ్మకముగలుగక ఆశ్చర్యము వేసినది. కాని, ఆలోచించి చూడగా స్త్రీని ఒకవిలాసవస్తువుగ మాత్రమే తలచెడి యీ అనాగరకరాక్షసులు తమ బిడ్డలపై ప్రేమగలిగి యుందురని భ్రమించుటకూడ వెఱ్ఱితనమే నని తోచినది. స్త్రీని క్రీడావస్తువుగ తలచుభావము పోవునంత దనుక ఏజాతికూడ ఉజ్జ్వలమైన

భవిష్యత్తునకలిగి యుండదని యుండుటవల్ల మనమునిశ్చయించ వచ్చును.

హెర్బర్ట్ స్పెన్సర్ దొర Sociology లో మానవుని తీవ్రమగు మనోభావమును గురించి వివరించుచూ, కోప ముతోవున్న సమయమున, ఎవరైనపిల్లవాడు ఏదైన వస్తువును తీసికొనిపోవునూ, ఆవస్తువును క్రింద పడవేసినచో వానిని చంపివేసెడి వాడని (will slay a child for letting fall something it was carrying)నీ, ఆతడిటులచేయు టకుగలకారణముతీవ్రమగు మనోవికారమేStrong emotion ననిన్నీ వ్రాసెను. అంతేగాక, "ఏవిధమగు పరితాపము, దుఃఖము లేకుండ తను బిడ్డలను అనేక సమయములందు చంపివేయుచుందురనిన్నీ Kill their children without remorse on various occasions,, వ్రాసెను.

Captain Cook టాహిటీజాతివారి దాంపత్య సంబం ధము అతిహీనముగ నున్నదని వ్రాసెను. వారిలో అందగత్తె యగు స్త్రీ ఒక భర్తతో తృప్తిపడెడిది కాదట. అంతేగాదు, అత్తవారి స్థితిగతులకంటె పుట్టింటివారి స్థితిగతులు బాగుగా నున్నచో, నాకు ఎక్కువమంది భర్తలు కావలెనని అధికార పూర్వకముగ అడుగుచుండెడిదట. As a right demand and obtain more husbands" Captain Cook కు తరువాత యీ జాతివారి స్థితిగతులను గమనించిన అనేక మంది యాత్రికులు పై విషయములన్నియు సత్యమేనని వ్రాయుటేగాక పురుషులు స్త్రీల నెంతో గౌరవముగ చూచు చుండెడివారని కూడ వ్రాసిరి. ఈకారణము వల్లనే, ఆదేశ మందలి శిశువులు వృద్ధిలోకివచ్చిరనియు, అంతేగాక యిచ్చటి

పిల్లలంత యోగ్యులను మరే దేశమందును చూడలేదనియు వ్రాసిరి.

మా యభిప్రాయము వారిని అనుకరించమనిగాదు. స్త్రీని గౌరవదృష్టితో చూడమని చెప్పుటయే. 1908 లో C. L. wragge తన The Romance of the South Seas అనే పుస్తకములో, టాహిటీ ద్వీపవాసులను గురించి, స్త్రీల ధర్మము లెవ్వి? గృహనిర్వహణ, బిడ్డలపోషణ, ఉత్తమమైన భార్య, మాతగనుండుట, రాజకీయ విషయము లతో సంబంధము పెట్టుకొనకుండుట, చిరిగిన బట్టలనుకుట్టుట. నా అభిప్రాయములో టాహిటీ ద్వీపమందలి స్త్రీలు, మహిళా రంగములో Bois లో వుండెడి స్త్రీలకంటెను, కొద్దిమందిని మినహాయించి బెల్‌గ్రేవియ స్త్రీలందరికంటెను ఎన్నోరెట్లు ఉన్నత స్థితియందున్నారు.(And what are the duties of women? To look after the house and mind the childern, to be good wife good mothers,to leave politicsalone and darn the cloths. Tahitian women in women,s sphere are superior by far in my openion, to their Sisters in the Bois,and few Balgraviennes can give them points) అనివ్రాసెను.

లంకా (Ceylon) ద్వీపమందలి అనాగరక వోడ్డా జాతీయులు తమ స్త్రీలను చాల గౌరవించుచుండెడివారు. ఇచ్చటి పురుషులు ఒక భార్యవుండగా మరొక భార్యను పెండ్లాడుటగాని, భార్యను వదలి వేయుటగాని చేయుచుండెడివారు కారు. వీరిని గురించి వ్రాయుచూ, హేకేల్ అను జర్మన్ విజ్ఞాన వేత్త సత్య సంధత, న్యాయబుద్ధిలో వీరు యూరోపియనులకు బుద్ధిగరువ జాలియున్నారు" అనివ్రాసెను. డాయక్ తోడా జాతీయులను గురించికూడ అతడీ రీతిగనే వ్రాసెను.

టిబెట్టునందలి స్త్రీల సౌందర్యమును గురించి విశేషముగ వ్రాయబడియున్నది. ఇచ్చటి స్త్రీలు ఒకేమారుగ అనేకమందితో సంసారిక సుఖము ననుభవించరు కాని వారికి జాలి కలిగినచో, ఏ పురుషుడైన తనతో సంసార సుఖము ననుభవింప గోరుచో తిరస్కరింపరు. అని వ్రాసెను. ఇందువల్లనే బహుశ రాజారామమోహనరాయలు టిబెట్టునందలి స్త్రీలను గురించి "ఆపత్కాలమున టిబెట్ దేశ వనిత యొక్క అనుగ్రహమువల్ల నా ప్రాణములు నిలచినవి; నేను ఆ సంఘటన జరిగిన నలుబది సంవత్సరముల తరువాత ఆ స్త్రీల సంగతిజ్ఞప్తికి రాగానే కండ్లనుండి నీరు కారుచున్నవి." అని వ్రాసియుండెను. ఈ స్త్రీలవల్లనే తాను తన జీవితమునంతను స్త్రీజనోద్ధరణకై అర్పించుచుంటినని ఎన్నోమారులు స్వయముగ చెప్పియుండెను.

మా యీ పైవ్యాఖ్య కంతయు, స్త్రీలు నీతిబాహ్యులుగ వుండవలెననిన్ని, అట్టి స్త్రీలను గౌరవించవలెననిన్ని కాదు. ఇట్టి స్థితియందు కూడ పురుషుని వంచింప బడలేదని న్ని, స్త్రీలు స్వాభావికముగ ఒక యోగ్యమైన ఆదరణీయమైన స్థానమును కలిగియున్నారనిన్ని నచ్చజెప్ప దలచుటయే.

ఫిజీ ద్వీపంలో గల స్త్రీలంత పతివ్రతలు మరెచ్చటనైన గలరా - యని సందేహం కలుగుతూవుంటుంది. ఎందువల్లనన, అచ్చటి స్త్రీలు భర్తతోపాటు ఆతని చితిపైన బుద్ధిపూర్వకముగ నిస్సంకోచముగ, నిర్విచారముగ, నిర్భీతిగ ఎక్కి భర్తతోపాటు తాముకూడ అసువులను త్యజింతురు. అచ్చటి పురుషులుకూడ పెక్కు వివాహములను చేసికొనరు. కాని మాటమాటకు స్త్రీలను హింసించు దురాచారముకలదు. అచ్చటి స్త్రీలస్థితి యింటియందు పెంపుడు జంతువుల స్థితికంటె

నీచముగ నున్నది. అచ్చటి తల్లులూ తమ బిడ్డలను యితరులు దొంగిలించుట లేక చంపివేయుటలను వాంఛించు చుందురు. కొడుకులు, తల్లులను చంపి తమకు వీరత్వమును ఆపాదించు కొందురు. ఇందుకు తండ్రులు హర్షింతురు.

ఇక స్త్రీలో - వారితో పోల్చి చెప్పదగిన కఠిన హృదయులు మరెచ్చటను కానరారని ఫిజీద్వీపమును చూచివచ్చిన అనేక యాత్రికులు వ్రాసిరి. అందుకు ఉదాహరణముగ యీ క్రింది విషయమును ఉల్లేఖించిరి.

పురుషుడు యుద్ధమునకుపోయి ఎవనినైన చెరపట్టి తీసికొనివచ్చును. ఆతీసికొనివచ్చిన వానిని చంపి తినుటకు పూర్వము, ఆ బంధింపబడినవానిని తమ స్త్రీల ఆనందమునకై అంతఃపురమునకు పంపుదురు. అప్పుడు ఆతని భార్య బంధితుని కరములను, హస్తములను బాగుగా బంధించి పడవేయును. ఆపిమ్మట ఆతనిచుట్టూ స్త్రీలందరూ జేరి చిన్న చిన్న కత్తులను తీసికొని ఒకతె (బంధితుని) కండ్లలోపొడచి గ్రుడ్లను తీయుట, మరొకతె పొట్టలోపొడిచి ప్రేగులను పైకిలాగుట యీరీతిని చేయుదురు. బంధితుడు ఎంతగా ఏడ్చిన వారికి అంత ఆనందము, కాని ఆస్త్రీలింత కఠిన హృదయలై వున్నప్పటికి వారికిగల పతిభక్తి, పాతివ్రత్యము మరేసభ్య, అసభ్య జాతులందును గాన్పించదని యాత్రికులు వ్రాసిరి. ఇంతటి పతివ్రతలుగా నున్న స్త్రీలు ఏదోషమువల్ల యింత కఠినహృదయులైరి?

స్త్రీల విషయమై పురుషునకుగల సహృదయత్వము, న్యాయపరత్వమును గురించి ఎన్నో ఉదాహరణములను యిదివరకే యిచ్చియున్నాము. వాటిని మరలమరల చెప్పి గ్రంథమును పెంచు టనవసరమే.

ప్రథమములో స్త్రీ పురుషులకు గల వివిధ సంబంధము ములను గురించి కూడ వివరించియున్నాము. జీవికి గల సంబంధము లన్నింట భార్యాభర్తలసంబంధమే దృఢమైనదనియు ఇది ఎంత దృఢమైనదో అంత స్పృహ, మోహము, దీర్ఘకాల స్థితియని కూడ మనకు ఋజువైనవి.

మనదేశమందలి పెద్దలు షడ్రసముల లోను మధుర రసమును శ్రేష్ఠమనియు, అట్టి మధురరసము యుక్త వయస్సు నుండిఉత్పన్న మగుననియు నిర్ణయించియున్నారు. సంఘములో మానవుడు ఎన్నిసంబంధములకు చెందిన రసభోగములను పొంది యున్నప్పటికి, మధురరసమునే శ్రేష్ఠమైనదిగను, తదితర రసములన్నియు అందే ఇమిడియున్నటులున్ను అనుభవించ గలుగుచున్నాడు. దీనినిబట్టి యోచించినచో, ఏదేశమున యీ మధురరస ధారణ క్షీణస్థితియందున్నదో, సన్నిహితత్వము ఎంత క్షణస్థాయి భగ్నప్రవణమై యున్నదో ఆ దేశ మందలి స్త్రీ పురుషుల పారస్పరిక సంబంధము కూడ అదే అనుపాతముచే అంత హీనముగనే వుండును.

ప్రపంచ మందలి ఏదేశమందైనగాని స్త్రీపురుష సంబంధము భార్యా రూపమునకంటె సోదరి లేక తల్లిరూపమున అధికప్రియమైనదిగ నున్నదని చెప్పినచో అదివినుటకు యింపుగావుండును గాని నిజమునకు అది మిథ్యయే.

అనాగరక పుర్వాజీయులను గురించి "ముసలమ్మలకు గౌరవము హెచ్చు; అన్నింటను వారిమాటనే శిరసావహించెదరు. (Oldest women exercise great authority)" అని వ్రాసెను. మెక్సికోయందలి ఆదిమవాసులు, హోయుదా వాసుల స్థితికూడ యీరీతిగనే వుండెడిది. చైనావారిలో ఇంటి పెత్తనమంతయు వృద్ధయగు బామ్మ (తండ్రి తల్లి) చలా

[illegible] సుమాత్రా, మడగాస్కర్ కాంగోలలో కూడ స్త్రీలు రాజులవలె అధికారత్వ మివ్వబడి యుండిరి.

ఇంతవరకు [illegible] కొంచెము దీర్ఘముగ యోచించి చూచినచో స్త్రీలను బరువుమోయు జంతువులుగా ఎంచు దేశములందును పెండ్లి సమయమున పశువులవలె స్త్రీల విలువ కట్టబడు దేశములందును, బిడ్డలను కనని కారణముచే తిరిగి బజారులో ఆమెను అమ్మివేయు దేశములందును, 'బానిస' అనుపదము స్త్రీకై మాత్రమే వ్యవహరింపబడు ప్రదేశములందును, అచ్చటి స్త్రీల కర్తృత్వ మేరీతిగ నుండును? అని సంశయము కలుగుచున్నది. దీనికి జవాబుగ Boncraft దొర ఒకచోట 'వారి కర్తృత్వము నామ మాత్రమే' నని చెప్పి యుండెను.

ఇక మన దేశస్థితిని యోచింతము. ఇచ్చటకూడ ఇంటి యజమాని లేనప్పుడు, ఇంట్లోగల తండ్రి తల్లి లేక వృద్ధ మాతయే యజమానురాలు. కాని ఆమె తరువాతనో?

మన దేశంలో ధన లోభమువల్ల ఎటువంటి ఘోరాజ్యాల నైన హింసింతుము. ఈ వాస్తవమును గురించి స్పెన్సర్ దొర ఒకచోట, "అధికత్వమునకై హిందూస్త్రీలు భర్తకు విషమిచ్చి చంపుచుండురు.(It was adopted as a reme-dy for the practice or Poisoning their husbands which had be-come common among Hindoo women. అని వ్రాసెను. పాపము! స్పెన్సరుదొరకు ఏ పండితుడు యీ విషయమును తెలిపెనో? భర్తతోపాటు సహగమన మొనర్చవలసిన ఆనాటి హిందూ స్త్రీ యాజమాన్యము కొరకు భర్తను చంపుకొనునని ఎవరునమ్మగలరు? భర్తతోపాటు వెంటనే, ఆమెకూడ సహగమన మొనర్చుట ద్వారా

మరణించవలసియే యున్నదిగదా! అట్టి స్థితిలో యీమెకు భర్త మరణమువల్ల ఆస్తిపై పెత్తనము వచ్చుటెక్కడిది? ఎట్టి వెర్రివాడు కూడ స్పెన్సర్ ద్వార హిందూ స్త్రీలపై మోపిన యీ అపనిందను తీవ్రముగ ఖండింపక వూరుకొనజాలడు!

పై విషయములవల్ల స్త్రీలకు వయోవిశేషమునుబట్టి ఏర్పడిన కర్తృత్వము నిజముగ గలదా? లేదా? వున్నచో ఏరీతిని వుండుటసంభవము- అను విషయమును గురించి మనము యోచింపవలసి వున్నది. దానితోపాటు స్త్రీ పురుషులకు గల అన్నివిధములగు సంబంధములవల్ల ప్రాప్తించిన అధికారములు ఎంతవరకు న్యాయవంతమైనవై యున్నప్పటికీ, స్థల, కాల, వయోభేదముల ననుసరించి స్త్రీకి పురుషు డిచ్చుచున్న గౌరవము చాలి యున్నదా? లేదా? ఏలనన పురుషులు వయోభేదముల ననుసరించి స్త్రీకి మేమిచ్చుచున్న గౌరవము సబబైనదేనని చెప్పుకొనుచున్నారు. ఎటులన ఒకానొక పండితుడు తన గ్రంథములో మనువు కాలమున స్త్రీలు విపరీతముగ వ్యభిచరించుచుండుటవల్ల వారికి యిట్టి భయంకరమైన నియమములు ఏర్పరుపబడిన వని వర్ణించెను. ఈ పండితుని దృష్టిలో వ్యభిచారముచేయుటలో గల దోషమంతయు స్త్రీదే నన్నటుల తోచుచున్నది పురుషుడిందు విషయములో ఏమాత్రము దోషికాడని యీతని అభిప్రాయము కాబోలు! ఇది ఎంతవరకు సత్యము అను విషయము కూడ విచారణీయమే.

ఏడమ్ స్మిత్ ద్వార ప్రపథమమున ప్రపంచమందలి సమస్త పదార్థములు ఏనైసర్గిక నియమమునకు అధీనమై యున్నవో, ఆ నియమమునకే వాటి మూల్యముకూడ అధీనమై యున్నదని ప్రచారముచేసెను. కాని, ఆనమయమున

ఆతని యీ యభిప్రాయమును ఎవ్వరూ తెలిసికొనజాలక పోయిరి. నాటి మానవులు ప్రతివస్తువు యొక్క విలువ, మనయిచ్ఛపై నాధారపడి యున్న దనిన్నీ, దాని మూల్యమును నిర్ణయించు అధికారము ఆవస్తువు యొక్క యజమానిదే గాని మరెవ్వరిదీ కాదనిన్నీ తలంచుచుండెడివారు. ఈ అహంకారమువల్లనే స్మిత్ దొర నుడివిన పై సత్యమును కొన్ని వందల సంవత్సరముల వరకు ఎవ్వరూ సమ్మతించ లేదు. నేటికికూడ అందరూ దీనిని ఏక కంఠముతో స్వీకరించుట లేదనియే చెప్పవలసియున్నది. కాని దీనిని స్వీకరించిన వారు మాత్రము యీ స్వాభావిక నియమమును ఉల్లంఘించినచో ఎన్నడును సత్ఫలితమును పొందజాలమని మాత్రము తెలిసికొనిరి.

వంగదేశమును ఉదాహరణగ గైకొనుడు. అచ్చట కులీనత వంశగతమైనది. అందుచే కులీనవంశమున జన్మించినవాడు ఎంతటి దురభ్యాసముల పాలైనప్పటికి, ఎంతటి దుర్నడత గలవాడైనప్పటికి ఆతని కులీనత తొలగిపోవుట లేదు. అందువల్ల అతడు ఎంతటి దురాచారుడగుటకును వెనుదీయుట లేదు. ఇందుకు మారుగ కులీనత గుణము ననుసరించియేవచ్చునను నియమమున్నచో, ఆతడు తన కులీనత్వము ఎచ్చట పోవునో అనెడిభయముతో సదాచారుడై యుండుటకు ప్రయత్నించును. ఇటుల ప్రతిజీవి ప్రయత్నించుట వల్ల సంఘము పుష్టివంతమైనదిగ నగును. అందువల్లదేశము ఉన్నత స్థితియందుండును. పతనావస్థ ఎన్నడును రాదుగదా!

నేటికి లోకము కండ్లు తెరచినది. వాస్తవికముగ విలువలేని వస్తువును రాజాజ్ఞ గానిండు, సంఘబలమువల్ల గానిండు, అత్యధికముగ లేనిపోని కల్పనలు చేసిగానిండు, మరింకేకారణ

మున గానింక, హెచ్చుగౌరవమును లేజాలము. ఈసత్యసిద్ధాంతమును రానురాను లోకులు గుర్తింప సాగిరి. దేనికి ఎంతవిలువగలదో అంతవిలువనే యిచ్చుటను తెలిసికొనసాగిరి. మోహమువల్ల గానింక, అహంకారమువల్ల గానింక, అజ్ఞానమువల్లగానింక, యివ్వదగిన గౌరవము, దానికి యివ్వకుండనున్నచో అందువల్ల శ్రేయస్సు ఎన్నడురాదు.

అసత్యమునకు విజయము దూరముగ నుండును. పై పద్ధతి ననుసరించి స్త్రీకి నేటివరకు యిచ్చుచున్న గౌరవము న్యాయవంతమైనదో కాదో యోచింపుడు. న్యాయవంతముగ నున్న మంచిదే. లేనిచో నేటివరకు స్త్రీజాతిని వంచించి, తద్వారా సంఘమునకు ఎంతో అపకారమును చేసితిమని తెలిసికొనుడు.

ఈ నా వ్యాసమును చదివి నామిత్రులు నన్ను వెక్కిరించిరి. మతి భ్రమణము గలిగినదని వ్రాసిరి. ఇటుల భావింతురని నాకు ప్రథమమునుండియే తెలియును. కాని వీటన్నిటికి జవాబిచ్చుట సిగ్గుచేటు.

ఆదిమవాసులయందలి సాంసారిక ఆచార వ్యవహారములను ప్రథమమున మేము వర్ణించియున్నాము. అందలి మా అభిప్రాయము పురుషులను దోషులనుటకాదు. ఇందును గురించి ఆరణ్యక స్త్రీల స్థితిగతులు, అత్యధిక నాగరకత గల స్త్రీల స్థితిగతులను పోల్చి చూచుటవల్ల మానవజాతియొక్క నైతికోన్నతియొక్క పరిమితి కట్టవచ్చును. ఇంతకుమించిమరే విధముగను వీలుకాదు.

Perhaps in no way is the moral Progress of mankind more clearly shown than by contrasting the position of women among Savages

with their position among the most advanced of the Civilized''. అని ఒక ఆధార వాక్యము గలదు. 'మానవుని నైతికోన్నతిని, అవనతిని పోల్చిచూచుటకు యింత కంటె మరే ఆధారము న్నూ లేదు. దీనిని సమర్థించి చూపుటకే మేమిన్ని ఉదాహరణల నిచ్చితిమి.

ఇంతకు పూర్వము కొంతవరకు చర్చించి విడచిన మధురరస చర్చను తిరిగి ప్రారంభింతము. ఇంతకు పూర్వము మధుర రసమే ఔన్నత్యమునకు మూలమనిన్నీ, దాని లేమియే పతన కారణమనిన్నీ నిర్ణయించితిమి.

ఈ మధుర రసము లేనివాడు మానవుడుకాడు. ఈరసమును అక్షుణ్ణముగ నుంచవలె ననెడి ప్రయత్నముతో నే మానవుడు అజ్ఞాతభావమున సతీత్వ సృష్టినొనరించెను. ఈరస మహాత్మ్యమును వర్ణించియే మానవుడు కవియయ్యెను. దీనిని కాదనుటకు వీలుకాదు. ఈమధుర రస తృణీకారభావము వల్లనే ఒకానొక కాలమున భారత దేశమున్నూ, మధ్యయుగమున యూరోపు ఖండము న్నూ స్త్రీని స్త్రీపురుష రూపముల విలక్షణమైన ప్రతినిధి (Peculiar representative of Se. xualty) అని స్త్రీని పేర్కొని పొరబడిరి. అందువల్లనే అవి పతనావస్థపాలైనవి. ఈరస బోధనమునకు ప్రధాన ఉపాదానము స్త్రీ సౌందర్యమే. ఎంతటి కఠిన హృదయుడుకూడ అందగత్తెను చూడగనే, ఆమె సౌందర్యమునకు బానిసయగును. ఫ్రటయా జాతీయులు ఎడ్లు, దున్నలు లేనిచో నాగలికి రెండువైపుల స్త్రీలనుకట్టి దున్నుదురు. ఇట్టి కఠినులు కూడ అందగత్తెచేత తక్కువకాలము దున్నింతురు. కొరియా దేశీయులుకూడ యీ రీతినే చేయుచుందురని అచ్చటికి పోయిన యాత్రికులు వర్ణించిరి.

అందగత్తెయైన స్త్రీకి కొంత ప్రత్యేక గౌరవము లభిస్తున్నదనెడి విషయం అనుభవములో కొంతవరకు సత్యమే. కాని యీ అందమో; స్థిరముగనుండెడిది కాదు గదా! బాహ్య సౌందర్యము సంతానోత్పత్తివల్ల, అనారోగ్యంవల్ల రానురాను క్షీణించిపోవును. అందువల్ల, ఆమెకు లభించు ప్రత్యేకగౌరవముకూడ క్షీణిస్తాయియేయని బోధపడుచున్నది. అనేకమంది యాత్రీకులు నిమ్నజాతీయులలో స్త్రీలకంటె పురుషులే ఎక్కువ అందగాండ్రుగా వున్నారని వ్రాసిరి. అందుకు గల కారణము నిమ్నజాతి స్త్రీలు మిక్కిలి కష్టించి పనిచేయుట వల్లనూ, ఎంత కష్టించినను వారికి లభించు ఆహారము అతి సాధారణమైనదనిన్నీ, బాల్యమందే సంతానము కలుగుట, విపరీతమైన యింటిచాకిరి, మొదలైన అనేక కారణములవల్ల నిమ్నజాతి స్త్రీలు అనారోగ్యవతులగుటకు ఎక్కువ కాలము పట్టదనిన్నీ, అందువల్ల వారిలో ఎక్కువమంది స్త్రీలు కురూపలుగానే వుందురనిన్నీ వ్రాసిరి. ఇట్టి కురూప స్త్రీలను హింసించుటలో పురుషులు అతి కఠినముగా వుండెడివారట.

స్థలాభావము, సమయాభావమువల్ల మేమిచ్చుట ఏఏ సంఘములు స్త్రీని ఏఏరీతిని అవమానించినవో, అవి యేయే రీతిని అధః పతనమైనవో, అట్టి సంఘమునందలి స్త్రీ; పురుష, బాల, బాలికలు ఏరీతిని అల్పాయుష్కులైరో ఉదాహరణ పూర్వకముగ వివరించ జాలకున్నాము. ఈ ఉదాహరణను ఎవరికివారు తమయింటి విషయమై అన్వయించుకొని పరీక్షించు కొనవచ్చును. మన స్త్రీలు తమ యౌవనమును అతి త్వరలోనే కోల్పోవుచున్నచో, వారి బిడ్డలు అల్పాయువులు, రోగులు గాకుండా నున్నచో - బాల్యముననే భర్తను

కోల్పో యిదుఃఖముతో నున్న తమ కుటుంబమును యింకను దుఃఖవంతముగ నొనర్చి ఆమెను భారముగ నెంచకున్నచో, అవుసరము వచ్చినచో అధర్మము కాని రీతిని స్వతంత్రముగ తన జీవితమును గడపుకొనుటకు మనము అభ్యంతర పెట్ట కున్నచో, మనము స్త్రీని తగురీతిని గౌరవించుచుంటిమనియే చెప్పవచ్చును. అటులచేయనిచో మనము ఘోరమైన తప్పును చేసితిమనిన్ని, అట్టి తప్పుకు పురుషులే బాధ్యులనిన్ని చెప్పి తీరవలెను. ఇందుకు మారుగా మరొక ఉపాయము గలదు. మనము స్త్రీల విషయములో అనేకములగు కఠిననియ మములను, అమలులో పెట్టితిమి. అట్టి కఠిననియమముల ఫలిత మెట్టిది? సాహసించి చెప్పినచో దుష్ఫలితమే ప్రాప్తిం చినది. కాదని ఎవరు సాహసించి చెప్పిఋజువు చేయగలరా? పురుషు లిందు విషయమై దీర్ఘముగ ఆలోచించి. ఏఏ నియ మములు ఎట్టి ఫలితములను కలుగ జేసినవో, ఏవిఎంతవరకు అవశ్యకములో తెలిసికొనినచో, మనువు కాలమున స్త్రీలు వ్యభిచరించుచుండెడివారనిన్ని వారియందలి వ్యభిచారమును రూపు మాపుటకై యీ కఠిన నియమములు స్త్రీలకు నిర్ణ యింపబడినవనిన్ని చెప్పెడి వెఱ్ఱిమొఱ్ఱి జవాబులకు తావుం డదు. ఆకాలమున వ్యభిచారము స్త్రీలలో హెచ్చుగా గలదు కాన అట్టి నియమములు ఏర్పరుపబడినవి; అది లేనిచో ఆని మములు ఏర్పరుప బడినవి; అది లేనిచో ఆనియమములుఅక్క ర లేదు గదా! నేడుకావలసిన నియమము లేవి? ఏవిఅక్కర లేదు? యోచించుడు. కావలసిన వానిని అమలులోవుంచుడు అక్కర లేని వానిని తోసివేయుడు. అటుల మీరు చేయ కున్నచో ఏనాటికైన మీరు స్త్రీజాతికి చేసినఘోరఅపచార

మునకు తగినశిక్ష పరమేశ్వరుని న్యాయాలయములో తప్పక లభించ గలదని తెలిసికొనుము.

మరొక విషయము కూడగలదు, ప్రతిజాతి, దేశము యొక్క భవిష్యత్తు, బిడ్డలపై ఆధారపడి యుండును. అట్టి బిడ్డల బాగోగులు తల్లులపై ఆధారపడి యుండును. బిడ్డలు తండ్రికంటె, తల్లితో నెక్కువసంబంధమును కలిగియున్నారు. ప్రపంచమున మహత్తర కార్యముల నొనర్చిన మహానీయులు తల్లుల జీవితములు, వారి ఔన్నత్యమును ఒకసారి పరికించి చూచినచో, పై విషయమెంతవరకు సత్యమైనదై యున్నదో గోచరించ గలదు. పతనావస్థయందున్న స్త్రీల సంతతికూడ పతన స్థితియందే యుండును. అదే నేటి మన దేశదౌర్భాగ్య స్థితికి కారణము. అటుల కాదందురా, ఏదో రీతిని జీవించుటను, ఎవరును జీవించుట యని అనజాలరు.

స్త్రీజాతి పతనమొందిన దన, సంఘమంతయు పతనమైనదని అర్థము. సంఘము అన స్త్రీ పురుషులు. ఈ యిద్దరి సుఖమే సంఘోన్నతి. ఇందులో ఏఒక్కరు ఉన్నత స్థితియందుండ కున్నను రెండవవారుకూడ పతన మొందిరనియేఅర్థం. వీరిద్దరికి కొన్నికర్తవ్యములు గలవు. అవి తగురీతిని పాలింపబడుచున్నవా, లేదా యని యిద్దరును పరీక్షించుకొనుచుండవలెను. కర్తవ్య పాలనలో తాను తన కర్తవ్యమును పాలించుచున్నానని తృప్తిపడుట చాలదు. రెండవపక్షము వారికికూడ సమానాధికార మిచ్చుచుంటిమా, లేదా యని యోచించుకొనవలెను. అప్పుడే తమ కర్తవ్యమును పాలించిన వారమగుదుమని తెలిసికొనుడని పాఠకులకు మా హెచ్చరిక.

లోకంలో అనేక విధాల పనులున్నాయి. అందులో కొన్ని పురుషులుమాత్రమే చేసెడివి. మరికొన్ని స్త్రీలు

మాత్రమే చేసెడివి. ఇక కొన్ని స్త్రీ - పురుషులు కలసి చేసెడివి. ఈకర్తవ్యపాలన విషయంలో స్త్రీల కివ్వబడిన స్వాతంత్ర్యం న్యాయవంతమైనదా! కాదా? లేక చెరసాలయందలి ఖైదీవలె నిర్బంధముపై స్వాతంత్ర్యములేకుండ చేయుంచుచున్నామా అనెడి విషయమై మనము యోచించవలసి వున్నది. ఆరీతిని స్వేచ్ఛ లేకుండ చేసెడిపనివల్ల కలుగు ఫలితము మంచిదిగ వుండదనుటను ఎవరును కాదనరు. అట్టి పరిస్థితిలో సత్ఫలితమును వాంఛించుటే మన ధర్మము గాన అట్టి స్వేచ్ఛను తప్పక స్త్రీలకు యివ్వవలసి యుండును. ఇటుల చెప్పుటలో వారిని స్వేచ్ఛగా విహరింప నివ్వమని మా అభిప్రాయము కాదు. అమెరికను స్త్రీలకు గల హద్దులేని స్వాతంత్ర్యము బందమువలె అయిపోయినదిగదా? ఒకానొకప్పుడు ప్రాచీన రోము దేశమున ఉన్నతవంశమునకు చెందిన వేశ్యాగా మారకుండుటకై కొన్ని కఠోరనియమములను ఆచరణలో పెట్టవలసివచ్చినది. నేనొకసారి ఏదో పుస్తకములో టిబెట్టు దేశములో ఒక్కొక్క స్త్రీకి అనేకమంది భర్తలుండెడివారని చదువుచూ, ఆ గ్రంథకర్త పరిహాసపూర్వకముగ నొకచోట అమెరికాఖండ స్త్రీలు, యీ సంగతిని చదివి మాకు కూడ అనేకమంది భర్తలు కావలెనని అందురేమోనని వ్రాసెను. అటుల జరిగినచో అమెరికను స్త్రీల అందచందములను చూచి పురుషులందరు వారివెంట పడెదరు. ఇట్టి పై కారణములవల్ల నాటి స్త్రీలకు కొన్ని నియమములను ఏర్పరుచవలసి వచ్చెను. ఒక్కసారిగా స్త్రీలకుగల నియమములన్నిటిని తొలగించివేయుట కూడ అవివేకమే.

ఏమయిన కానిండు. స్త్రీలకు కావలసినది. వారుచేసెడి పనులలో న్యాయవంతమయిన స్వాతంత్ర్యము, ఇప్పుడు మనల

నెమర్కొను సమస్య- ఏ పనులు పురుషులవి? ఏవి స్త్రీలవి? ఏవి ఇద్దరూ కలసి చేయవలసినవి? మానవసంఘము యీ విషయమును నిర్లక్ష్య భావముతో వదలివేయుటచే అనేక ఘోర సంకటములను కలుగజేసినది. పురుషులు ఎక్కువగ యుద్ధములు చేయుట, వేటాడుట మొదలగునవి, ఇంతకంటె వారెక్కువ చేయరు. ఇక జీవితమునకు కావలసిన పనులలో ఎక్కువ భాగము స్త్రీలవే. నీళ్ళుతోడుట, కట్టెలుకొట్టుట, బరువుమోయుట, పొలము దున్నుట, పిల్లలనుకనుట, వంట చేయుట, బిడ్డలపోషణ, ఇతరకార్యములన్నియు స్త్రీలవే. ఇంతేగాదు, వేటలో చంపబడిన జంతువులను మోసికొనివచ్చుటకు స్త్రీలుకూడ వేటకుపోవు పురుషుల వెంట పోదురు.

పైన కొన్ని ధర్మములను, స్త్రీలవేవో పురుషులవేవో వివరించితిమి. కాని అన్ని దేశములందును స్త్రీ, పురుష ధర్మములు పైరీతినే వుండునని మేము చెప్పజాలము. ఒకానొకప్పుడు ఆయాజాతుల నాగరికతల ననుసరించి స్త్రీ పురుషుల కర్తవ్యములలో ఒక విధమగు పోలిక వుండెడిది. కాని యీ నాగరికతా లక్షణములు భ్రష్టములగుచుండ యీ కర్తవ్యములతో గల పోలికలుకూడ నశించి పోయినవి. ఉదాహరణగా చూడుడు. ఆంగ్లేయులుగాని, ఫ్రెంచి దేశీయుడుగాని ఎచ్చటినుండియైన దూరమునుండి నీరు తేవలసివచ్చుచో తాను స్వయముగనె నీరు తెచ్చును. కాని మనవారో, పై రీతిని చేయుటకు సిగ్గుపడి చచ్చెదరు. ఈసిగ్గుకులోబడి గర్భవతిగా నుండి లేవలేని స్థితియందున్నప్పటికి కూడ, దూరముననున్న చెరువు నుండి నీరుమోసికొని రమ్మని భార్యను పంపుదుము. పెరూదేశము ఉచ్చస్థితి యందున్న కాలమున అచ్చటి పురు

షులు యింటియందు నూలువడుకుట బట్టల నేయుటయూ, స్త్రీలు నాగలి దున్నుటయూ చేసెడివారు. నేటికికూడా సామోయా దేశములో పురుషులు యింటియందు వంటచేయుటయూ, స్త్రీలుబజారు పనులు చూచుటయు చేయుచుందురు. అబిసీనియా దేశమందలి పురుషులు బజారుకు వెళ్ళి సామానులు తెచ్చుటను తలవరికెనట్లుగా తలంచెదరు: కాని రేవుకుపోయి స్త్రీ పురుషుల బట్టలను వుతుకుటను గౌరవముగ ఎంచెదరు. పై రీతిని వివిధ దేశములలో వివిధ విధములుగ స్త్రీ పురుషుల కర్తవ్యములు గలవు.

పై విధమున చూడగా, పండితులందరు ఆదికాలమున పురుషులకంటె స్త్రీలదే పైచెయ్యిగ ఉన్నదని తోచి ఆనాటి స్త్రీలను Leader of Civilization అనెడివారు. ఇట్టి అత్యధిక గౌరవము పొందెడి స్త్రీల స్థితి రానురాను యింత హీనముగ నేల పరిణమించినదో వివరించుచూ స్పెన్సర్ దొర యీ రీతిని వ్రాసెను. యుద్ధములు తరచు చేయు జాతులందలి పురుషులు రానురాను స్త్రీలపట్ల ఎక్కువగా అన్యాయము చేయుచుండెడి వారనిన్నీ, స్త్రీలు తమ సౌకుమార్యము, కోమల స్వభావములవల్ల వాటినన్నిటిని ఓర్చుకొనుచుండెడివారనిన్నీ, వ్రాసెను. అంతేగాదు. పురుషులు తమ శారీరకబలమువల్ల స్త్రీలను వశపరచుకొనిరి. వారిని శారీరకముగ జయింపజాల నందువల్ల రానురాను స్త్రీలు పురుషులకు లోబడసాగిరి. శారీరకముగ పురుషులను జయింపగల శక్తిగలిగియున్నచో స్త్రీలు లోబడెడివారేగాదు. ఏలనన అనేక స్థలములలో శక్తిగలిగిన చోట పురుషులకంటె స్త్రీలే ఎక్కువ కఠినహృదయస్థులై యుండిరనుటకు అనేక ఉదా

వారణలు గలవు. దీనినిబట్టి స్త్రీలను పురుషులు పశుబలము వల్లనే వశపరచుకొనిరని చెప్పవలసివచ్చును.

పై విషయమును గురించి అనేకులు అనేక విధములుగ వ్రాసిరి. వాటి అన్నింటను స్పెన్సర్ దొర వ్రాసిన విషయములే ఎక్కువ విశ్వసనీయముగ గనిపించుచున్నవి. ఆయన "యుద్ధ ప్రియత్వము తప్పనిసరిగనే బలాత్కారముగ సహాయోగమునకు ప్రాధాన్యతకు గల్పించినది. Militancy inplies predominance of Compulsory Co-peration అని వ్రాసెను. ఇందువల్ల కలిగిన ఫలితమును గురించి "ఇందువల్ల స్త్రీలను దొంగిలించుట, అమ్మివేయుటలలో వారి అధికారమును ఎవరూ లక్ష్యపెట్టెడివారు కారు. ఇటుల స్త్రీ పురుష సంబంధము బహు వివాహముల రూపమున అసమాన స్థితిని పొందెను. అట్టి కారణమున స్త్రీలను పనిగత్తెలుగా భావించసాగిరి అందుచే భార్యా బిడ్డలపైన పురుషులకు (చంపుటకుగాని, బ్రతుకనిచ్చుటకుగాని) సర్వాధికారములు వచ్చినవి. ఇందు మూలమున యింటియుందలి వారందరు యింటిలోగల వృద్ధుడగు పురుషునకు లోబడి యుండసాగిరి. ఇందుకు విరుద్ధముగ శిల్పాది కార్యముల నొనర్చు వారిలో స్త్రీ సహాయోగము పురుషునకు కావలసి యుండుటచే స్త్రీ పురుషుల వ్యక్తిగత స్వభావము వికాసవంతము కాసాగింది నే పిట్టి సంఘీయులు శాంతి పూర్వకముగ నుండువారు కానింకు సాధారణ అల్ప సంఖ్యాకులు కానిందు సైనికత్వముయొక్క హద్దునుండి అతి దూరమున కేగిన పెద్ద పెద్ద సంఘము గలవారు కానింను, ఇట్టి సంఘీయుల స్వభావము పరోపకార బుద్ధితో నిండి యున్నదే (Hence the disregard of women,s claims shown in stealing

and buying them, hence inequality of status between the sexes entailed by polvgamy, hence the use of women as labouring slaves, hence the life and death power over wife and child and hence that constitution of the family which Subjects all its members to the eldest male conversely the type of individual nature developed by voluntary co-operation in societies that one Predominantly industrial. whether they be peaceful, simple tribes or nations they have in great measure oui grown military, is a relatively altrunistic nature.

బలవంతముపైనైనకొను సహాయోగము అన్నిటికంటె ఎక్కువ బంధనకారి. అది పుణ్యకార్యముకే కానిండు, యుద్ధముకే కానిండు, మరింకెందుకైన కానిండు. అది చాల హీన కార్యమనిన్ని స్త్రీలను అతి నీచముగ భావించుట యనిన్ని చెప్పక తప్పదు. ధార్మిక అంధ విశ్వాసమూ, అధర్మమనే దుండగమూ స్త్రీల స్థానాన్ని ఎంత నీచస్థితికి తెచ్చినవో తెలిసికొనుటకై యూరోపు ఖండపు మధ్యయుగపు పరిస్థితిని గమనించవలెను. ఈ విషయమును ఋజువుచేయు ఉదాహరణముల నెన్నిటినో ఇదివరలో వివరించియే యుంటిమి. ఆవశ్యకమగుచో మరికొన్ని అచ్చటచ్చట వివరింపగలము. ధార్మిక అంధవిశ్వాసము స్త్రీల నిట్టి నీచస్థితికి ఏల ఎటులగొని వచ్చినదో ఇచ్చట వివరించుట అప్రస్తుతమని యెంచి వదలి వేయుచున్నాము. ప్రపంచంలో సిరిసంపదలవలె స్త్రీకూడ చెడ్డవస్తువే. అందువల్లనే స్త్రీని 'ద్వారం కి మేకం నరకస్య నారీ' స్త్రీ నరకద్వారమని వ్రాసిరి. ఇందలి భావము, పరలోకమును ప్రాప్తి చేసికొనగోరుచో స్త్రీని నరకద్వారమువలె ఎంచుము; కాని ఇహలోకమును సుఖవంతముగ నొనర్చుకొన

గోరుచో యీ విషయమున లోకు తాలుల నడచుచున్నారో చూచి వారిప్రకారము నడచుకొనుము నీ యిష్టముండినన్ని నీకు శక్తిగలిగినన్ని వివాహములను చేసికొనుము. ఏజాతిలోనిది విధములుగలవు. కాని నీవు మరణించునప్పుడు వారిని విడిచి పోరాదు. నీతోపాటు పరలోకమునకు తీసికొనిపొమ్ము. ఇక నీతో తీసికొని పోజాలనిచో వారిని భయపెట్టి ఒడభరకను నొనర్చి వదలుము. స్త్రీని పెండ్లాడు ఆచారమును చూచినచో ఒక విధముగ గౌరవవంతమైనదే; స్త్రీ పురుషులను ప్రాకృతికముగను, స్వాభావికముగను బంధించుటకుగల విధాన మీ వివాహ మొక్కటే. దీనిని సంరక్షించుటకు మన దేశమున నున్నన్ని నియమములు, కతంత్రములు మరే దేశమందును లేవు.

ఒకానొక పెద్దమనిషి తన వ్యాసములో ఒకచోట 'సాంఘిక సమస్య లన్నిటికి మన దేశ మిచ్చిన జవాబే శ్రేష్ఠమైనది. అంతకు మించిన జవాబు మరెద్దియూ లేదు. ప్రపంచమంతయు తప్పనిసరిగ దానిని సమ్మతించవలసియున్నది' అని వ్రాసెను.

మనము సాంఘికోన్నతి విషయమును యోచించనే యోచించుట లేదు. మనకండ్లయెదుట ప్రపంచమందలి ఎన్నో జాతులు స్వేచ్ఛననుభవించు చున్నవి. సుఖపడుచున్నవి. ఉచ్ఛస్థితికి వచ్చినవి. తమలో తమకుగల అనేక సమస్యలను పరులుజోక్యము కలిగించుకోనక్కర లేకుండగనే పరిష్కరించు కొను చున్నవి. కాని మనమో—రాను రాను అధోగతికే పోవుచున్నాము. కాని మనకు మన దుఃస్థితిని గురించిన యోచనయే లేదు.

వివిధజాతి భేదములు, బాల్యవివాహములు, రజస్వలానంతర వివాహములు చేసిన వెలివేయుట, అతి బాల్యస్థితి

...ంపే భర్తను కోల్పోయిన స్త్రీని జీవితమంతయు విధవవలె నుంచు పరాక్రమము, వృద్ధునకు యిచ్చుకాని పిల్లలనిచ్చి పెండ్లిచేయుట, ఇట్టివి ఎన్నో సంఘమును పతనావస్థకు తెచ్చిన దురాచారములు మనలోగలవు వీటిని పరిష్కరించు యోచనయే మనలో లేదు ఎవరైన సంస్కరణనారంభించుచో మనము పండితులు పెడబొబ్బలు పెట్టుచూ, సంస్కర్తలను నిందింపనారంభింతురు వీరు మన పూర్వఋషులకంటె ఘనులా యందురు. అదరిపాటొందురు. అనుభవము లేని ప్రేలాపనలందురు. వారికి పరిస్థితులను గురించి ఎంతవచ్చు జెప్పినను 'పాతపాటే' పాడెదరు.

మన ఆచారవ్యవహారాలు మనలను ఏరీతిని భ్రష్టుల నొనర్చుచున్నవో, మనలో సంస్కరణ ఎంత ఆవశ్యకమో తెలుపుటకు ఒక చిన్న ఉదాహరణ నిచ్చెదను. ఒక బాలిక గలదనుకొనుడు. ఆమె అనారోగ్యవతి, చదువుకొనలేదు. శరీర దార్ఢ్యము లేదు. రోగిష్ఠిది, అయినప్పటికి ఆమెను పెండ్లి చేసి తీరవలెను గదా! అన మాతృత్వ మనెడి భారమును ఆమె తప్పనిసరిగ మోయవలసి యున్నదిగదా యని భావము.

మరొక బాలికగలదు. అమె చదువుకొన్నది; ఆరోగ్యవతి; దృఢశరీర; మాతృత్వమునకు సర్వవిధముల అర్హురాలు. కాని విధవ. ఇచ్చట అనారోగ్యవతియగు కన్యకకు వివాహ మొనర్చినందువల్లగాని ఆరోగ్యవతియగు స్త్రీని విధవవలె వుంచుట వల్లగాని, ధర్మరక్షణ ఏరీతిగను కాజాలదు.

నాగరికులైన మానవులు పవిత్రమైన బుద్ధితో స్త్రీజాతికి ఏయే అధికారముల నివ్వ వచ్చునని చెప్పిరో, అవి న్యాయవంతమైనవిన్నీ, సంఘశ్రేయస్సుకు ఆటపట్టయినవిన్నీ సాంఘిక నీతికి విరుద్ధమైనవి కానివిన్నీ అయియున్నవి

ధర్మగ్రంథాల్లో వ్రాసియున్న విషయములవల్ల ఏ సంఘమూ ఉన్నతస్థితికి రాదు. ధర్మవచనములనేకరువుపెట్టుట కూడ నిష్ప్రయోజనమే. మేమింతవరకు స్త్రీగౌరవమును గురించి విమర్శించుచూ యిట్టి అధికారము, యిట్టి స్థితిని గురించియే వివరించియున్నాము. మా యీ విమర్శలో స్త్రీలసంఖ్య స్త్రీల ఆవశ్యకత (Supply & Demand) ల ననుసరించి స్త్రీని గౌరవించమని మేము ఎన్నడునూ చెప్పము. ఏలనన పురుషులసంఖ్య అత్యధికముగ పెరిగిపోయి స్త్రీల సంఖ్య చాలా తక్కువగ నుండుకాలము ఎన్నటికైన రాగూడదా? స్త్రీ గౌరవము- పురుషుని స్నేహాబుద్ధి, సహానుభూతి, న్యాయధర్మములపై ఆధారపడియుండును. భగవంతుడీ స్త్రీ జాతిని దుర్బలులుగా సృజించినాడు; కాని పురుషుడు వారి యందు తరుగుబడియున్న ఆ బలమును పైనచెప్పిన వృత్తుల సహాయముచే పూర్తిచేయ వలసియున్నది; అంతేగాని ధర్మ గ్రంథములందలి మారుమూలలందున్న బోధపడని అర్థములు గల శ్లోకములను సహాయముగ గొని కాదు.

దీనికి తగిన దృష్టాంతము జపానుదేశము. జపాను దేశీయులు ధర్మశాస్త్రములు, ధర్మశాస్త్రకారుల బంధములను వదలించుకొనిననే సంఘము ఉన్నతస్థితికి రాగలదని గుర్తించి, సంఘసంస్కరణను ధర్మశాస్త్రములతో ముడివైవక దేశకాల పాత్రముల ననుసరించి సంఘసంస్కరణ మొనర్చిరి. నాటినుండి అచ్చటి స్త్రీజాతి ఉచ్చస్థితికి రాసాగినది. కొద్దికాలమునకు పూర్వము నేటి చీనాదేశ స్త్రీలకు ఏమాత్రము తీసిపోని దుస్థితియందే జపాను స్త్రీలుకూడ నుండిరి. ఇట్టి దుస్థితియందు యూరోపియనులొక్కరేగాదు. తదితరులుకూడ నుండిరి. వారిని గురించి ధర్మశాస్త్రకారులు పురోహితులు

స్త్రీలకు బద్ధశత్రువులుగ నుండిరి. కాని స్త్రీలో వారికి పరమమిత్రులుగ నుండిరి. (Clergy havebeen the worst enem. ies of women, women are their best friends) అని వ్రాసిరి. స్త్రీల స్థానాన్ని నైచ్యమొనర్చుటకై ధర్మశాస్త్రకారులు ఎంతటి పట్టులను పట్టుచుండెడివారో తెలియుటకుగాను St Ambrose ఒక చక్కనిమాట చెప్పియున్నాడు. ఈ ధర్మశాస్త్రకారులు స్త్రీలను గురించి నిస్సంకోచముగ "వివాహము భగవంతుని సృష్టిలో లేదు. (Marriage Could not have been god's original theme of creation అని ప్రచారమొనర్చుచుండెడివారు. ప్రజలు వారిని యీశ్వర దూతలుగా విశ్వసించుచుండుటవల్ల వారేమని చెప్పినను నమ్ముచుండెడివారు.

ఇందుకు విరుద్ధముగ ఒక్క ఖురాన్ గ్రంథములో మాత్రము గలదు. కాని ఖురాన్‌లో స్త్రీలకుగల స్థానమేదియో చెప్పుట మిగుల కష్టమేకాని మహమ్మదునా పెంబుగారు స్త్రీల నెక్కువ గౌరవదృష్టితో చూడవలెనని, కొడుకు కూతుళ్ళ విషయంలో హస్తిలశకాంశభేదము కల్పించుట మహాపాపమనిన్నీ, అరబ్బులు యూదులలో అతినీచస్థితియందున్న నాటి విధవలను గురించి చెప్పుచూ వారియందెక్కువ దయ, న్యాయదృష్టి కలిగివుండవలెననిన్నీ చెప్పిరి.

వాస్తవమునకు ఆనాటి అరబ్బు స్త్రీలస్థితి అతి నీచముగ నుండెను. అందువల్లనే మహమ్మదు ప్రవక్త యీరీతిని శాసించెను. లేకున్న నారేమయి యుండెడివారో! Hornbeck, Ricaut మొదలగు కొందరు గ్రంథకర్తలు మూసల్మాను మతములో స్త్రీకి ఆత్మ లేదనిన్నీ, వారినుత్ప్రకారము స్త్రీలను పశువులుగా చూతురనిప్రచారము చేసిరి. వీరు దేనినాధారముగగొని

యిటులు ప్రచార మొనర్చిరో బోధపడుట లేదు. ఖురానుగ్రంథ ములో మాకెట్టివాక్యము లెచ్చటను కాన్పించ లేదు. అంతేగాదు ఖురానునందలి తృతీయాధ్యాయములో చివరభాగమున మరణానంతరము దుష్కార్యముల నొనర్చినవారిని ఈశ్వరుడు శిక్షించును అప్పుడాతడు స్త్రీ, పురుష భేదములను పాటింపడు అని గలదు. దీనినిగురించి యోచించగా స్త్రీకి ఆత్మలే దను అభిప్రాయము మహమ్మదు ప్రవక్తకు లేదని స్పష్టపడ గలదు. ఖురానునందలి నాల్గవ అధ్యాయమునందునూ, మరి కొన్నిచోటులందు, అనేక పర్యాయములు 'స్త్రీలను దయతో చూడవలెను. వారికి న్యాయముగ రాదగిన అధికారముల నివ్వవలెను. వారిని మోసగించరాదు' అని మహమ్మదు ప్రవక్త చెప్పెను. అయినప్పటికి ప్రజలు మహమ్మదీయ మత ములో స్త్రీలకు గౌరవనీయమైన స్థానము లేదని నమ్ము చున్నారు.

ఇందుకుగల ప్రబలకారణము ఖురానులో బహువివా హముల నొనర్చుకొనుటకు అనుమతినిచ్చుటయేయని తలం తుము. చతుర్థాధ్యాయమున ఆరంభమునందే 'నీకు నచ్చిన యిద్దరు, ముగ్గురు, లేక నల్గురు స్త్రీలను పెండ్లిచేసి కొనుము. కాని నల్గురికంటె ఎక్కువమంది స్త్రీలను పెండ్లి చేసికొనకుము (Take in marriage of Such other women as please yow, two or three or four and no more) అని ఆదేశించెను. ఇదిగాక, నమ్మకస్తులు, సాధుపురుషులు స్వర్గమునకు పోయి అనేకములగు సౌఖ్యముల ననుభవించెదరని కూడ చెప్పెను. ఈ విషయమును విమర్శించుచూ ఖురా నును అనువదించిన Sale దొర ఒకచోట సత్స్వభావలగు

స్త్రీలు సమస్తసుఖములు ఆనందములు అనుభవించుటకు అనువగు సుఖము, ఆనందములుగల ఒకస్వతంత్ర స్థానమునకు పోదురు. ముసల్మానులు అర్ధ-నీతిని నెరవేర్చుకొనుటకై పై సుఖము, ఆనందములతో పాటు తమ మనసుకు నచ్చిన ఇష్టులగు ఉపపతుల సౌఖ్యముకూడ లభించునా, లభించదాయనెడి విషయమును తెలిసికొనుటకు కావలసిన ఆధారములు నాకెచ్చటను దొరుకలేదు.

(But that good women will go into a Separate place of happiness where they will enjoy all sorts of dilights, but whether out of these delights will be the enjoyment of agreeable paramours created for them, to complete the econo my of Mohaummadan System, is what I have found no where decided) అనివ్రాసెను. ఇదే మహామ్మదు ప్రవక్త ఆశయ మగుచో, ముసల్మాను స్త్రీల స్థితిని గురించి మనమెక్కువ విశేషకృషి చేయవలసినపని లేదు. మహామ్మదు ప్రవక్త ఒకచోట స్వయముగ "నేను స్వర్గము వైపు చూచితిని. అచ్చట వున్న వారిలో ఎక్కువమంది బీదలే; తరువాత నరకమును చూచితిని, అచ్చటగలవారిలో ఎక్కువమంది స్త్రీలే. (When he took a view of paradise he saw the majority of its inlabitants to be the poor, and when he looked down into hell, he saw the greater part of the wretches confined there to be women) అని చెప్పెను.

ప్రపంచములో అనేకమంది, 'కావలసిన దానికంటె స్త్రీల జనసంఖ్య హెచ్చు కావున సహజముగనే స్త్రీల

నున్నామని. ఖురైశ్ వాసులు మక్కాకు సమీపమున గల అబూదిలామా పర్వతముపైన తమ కన్యలను వధించు చుండెడివారు. గ్రీకుదేశ ప్రాచీన చరిత్ర వ్రాసిన స్ట్రైబోనో ద్వార, "The Practice of exposing female infants, and putting them to death being so common among the ancients, that it is remarked as a thing very extra-ordinary in the Egyptians, that they brought up all their children) (ప్రాచీన జాతులలో చిన్న చిన్న ఆడపిల్లలను అడవిలో విడచివచ్చుట, చంపివేయుటలు అతి సామాన్యముగ నుండెడివి ఈజిప్షియనులలో బిడ్డలను పెంచుట, వారిని పోషించుటలు వారికి చాల అసాధారణము, విలక్షణమునై యున్నవి.) అని వ్రాసెను. చీనాదేశములో నేటికిని యిట్టి దురాచారము గలదని తెలియుచున్నది. ఈజిప్షియనుల గురించి Posidippus ద్వార చెప్పిన ఒకమాటను Sale ద్వార ఉదాహరించుచూ "A man, though too poor, will not expose his son. but if he is rich, will scarce preserve his daughter (బీదవాడు పుత్రుని అడవిలో వదలి రాడు. ధనవంతుడు అయినచో కూతుని పెంచి పెద్దచేయును) అని వ్రాసెను.

పై అనేక ఉదాహరణలవల్ల ప్రజలు యుద్ధములుచేసి స్వయముగ చావనించు, లేక కన్యలను చంపివేయనించు, ఇందువల్ల స్త్రీలసంఖ్య పెరుగుటగాని తరుగుటగాని సంభవించుటలేదు. స్త్రీని గౌరవించుట, అగౌరవించుటలు వారి జన సంఖ్యపై ఆధారపడియుండలేదు. స్త్రీ-సంపద, విలాసవస్తువు, అనెడి పురుషునకుగల ధారణపైననే ఆమెయొక్క గౌరవాగౌరవములు ఆధారపడియున్నవి. ఇందువల్లనే జనులు తమ

కన్యలను చంపుచుండెడివారు; ఇందువల్లనే పరుల కూతుం డ్రను దోచుకొని వచ్చుచుండెడివారు. ఇందువల్లనే పరుని కూతును దోచుకొని వచ్చుటను పురుషుడు గౌరవప్రదముగ నెంచుటయు, ఎక్కువమంది భార్యలను కలిగియుండుట గొప్ప తనమునకు చిహ్నముగ నెంచుటయు ఏటప్పించినది.

Burchhardt దొర, "అరాబీయులు నేటికి కూడ యూరోపులో పురుషుడైన ఒకే భార్యను కలిగియున్నాడని వినినచో ఆశ్చర్యపోదురు. అతడీ మాటనునమ్మనే నమ్మడు" అని వ్రాసెను.

ఇప్పటికే గ్రంథము చాల పెరిగిపోయినది. ఇంకను విస్తరించి మీకు శ్రమను కలిగించను. పురుషులు దీనిని చదివి కోపగించుడు. కోపగించకుడు, మాకు సత్యమనితోచిన దానిని మీ ఎదుటపెట్టితిమి? నిష్కపట భావముతో స్త్రీ గౌరవము ఏలలుప్తమయినది? నిజమునకు లుప్తమైనదా-లేదా స్త్రీ గౌరవము తగ్గుటవల్ల సంఘమునకు కలుగు నష్టమేమి? స్త్రీలపై లేనిపోని అధికారములను కల్పించుకొనుట వలన పురుషులకు కలుగు అపాయములెవ్వి- ఈ మొదలగు విష యములనన్నిటిని చర్చించితిమి. పై విషయములను చర్చించు టలో శాస్త్రములకు గల గౌరవము పోవుననిగాని సంఘీ యులు కోపగించుకొందురని గాని, దేశాచారములు ఇందుకు విరుద్ధముగ నున్నవా, అనుకూలముగ నున్నవా, యని గాని సంకోచించలేదు. ఏది నిజమని తోచినదో దానిని చెప్పితిమి. అందలి ఫలాఫలములను పాఠకులకే వదలుచున్నాము.

Herbert Spercer ద్వార స్త్రీ-పురుషులు ఎట్టి సంబంధమును కలిగి యుండవలెనను విషయమును గురించి వ్రాసిన ఒక భాగమును మాత్రము ఉల్లేఖించి యీ వ్యాసమును ఉప సంహరింపదలచితిమి:—As monogamy is likely to be raised in character, by a public Sentiment requiring that the legal bond shall not be entered into unless it represents the natural bond, So, perhaps it may be, that maintenance of legal bond will come to be held improper if the natural bond ceases. Already increased facilities for divorce point to the probability that where as while permanent monogamy was being evolved, the union by Law (originally the act of purchase) was regarded as the essential part of marriage and the union by affection as non essential, and where as at present the union. by Law is though the more important, and the union by affection the less important, there will come a time when the union by affection will be held of primary moment and the union by Law as of Secondary moment, whence reprobation of marital relations in which the union by affection has dissolwed. That this conclusion will be at present un-acceptable is likely I may say certain....those higher sentiments accompanying union of the sexes which do not exist among primitive men, and were less developed in early European times than now may be expectedto deveop still

more as declive of militancy and growth of Industrialism, foster altruism, for sympathy which in the root of altruism, is a chief element in these Sentiments. (ఎప్పటివరకు స్త్రీ పురుషులలో స్వాభావిక బంధన వుండదో అప్పటివరకు చట్టసంబంధమైన బంధనలో పడకుండ నున్నచో ఏకపత్నీ వివాహ విధానము గౌరవ ప్రదము, సర్వజనాదరణీయము కాగలదు. ఎంత వరకు పై స్వాభావిక బంధనము స్త్రీ పురుషులలో లేదో అంత వరకు పై చట్ట సంబంధమగు బంధనను పాటించుట అనుచితముగ ఎంచబడవలెను. నేడు విడాకులు విషయమై ఏర్పడిన అను కూల్యములన్నియు యీవిధానము వచ్చుటకేనని ఎంచునటుల చేయుచున్నవి. ఏకపత్నీ వివాహవిధానము గౌరవప్రదముగా ఎంచబడుచుండి చట్టమూలకముగ స్త్రీ పురుషులను ఏక మొనర్చుట మూలమున వివాహమున కొక ప్రధాన అంగ ముగ ఎంచబడి, చట్టముద్వారా ఇద్దరిని ఐక్యపరచుట ఎక్కువ గౌరవ ప్రదమని ఎంచబడి ప్రేమ ద్వారా యిద్దరూ ఐక్య మగుట గౌరవ హీనమని ఎంచబడు చుండుట వల్లనే, ప్రేమ పూర్వకముగ యిద్దరూ ఐక్యమగుటయే ఎక్కువ గౌరవప్రద మున్నూ, చట్టము ద్వారా యిద్దరూ ఐక్యమగుట గౌరవహీన ముగను ఎంచెడి కాలము వచ్చితీరును. ఇట్టిప్రేమలేని వివాహ బంధములు నింద్యములు త్యాజ్యములుగ ఎంచబడును. ఈ పరిణామమును నేటి వారు ఒప్పుకొనక పోవచ్చును. స్త్రీపురుష సంయోగముతో పాటు ఆది కాలమందలి మానవులలో

లోపించియున్న. నేటికంటె ఆరంభయూరోపీయ కాలములో తక్కువగ వ్యాపించియున్న ఉచ్చకోటికి చెందినవారి భావ నలు యోచనలను గురించి మనమీ రీతిని ఆశించవచ్చును. రానురాను యుద్ధ ప్రియత్వము తగ్గిపోయి, శిల్పకళ వృ యగుటవల్ల పరోపకారము, పరార్ధభావములు ప్రజలలో వృద్ధి కాసాగును. అదేరీతిని పై మన ఆలోచనలు కూడ అ వృద్ధికాసాగును. ఇందుకు గల ముఖ్యకారణము సహానుభూ యనునది పరోపకారము, పరార్థములకు మూల మగుటయే అదే యీ పై భావముల యొక్క మూల తత్త్వము.)

బెజవాడ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియెను. 1945